## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వారి వెబ్ సైట్: http://sundarayya.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## సుందరయ్య విజ్ఞాన కేంద్రం వారి వెబ్ సైట్:

## http://sundarayya.org/

Sundarayya Centenary Ce ×

sundarayya.org

# Sundarayya Vignana Kendram

Home | About SVK | Library | Projects | Donations | Publications | స్వేచ్ఛా విజ్ఞాన ప్రవంతి | Services | Contact Us

## Sundarayya Centenary Celebrations

### India Today: Looking Back, Looking Forward

India Today: Looking Back, Looking Forward
Watch Videos (Click to Download Papers)

On the occasion of the birth centenary of P. Sundarayya, a freedom fighter, communist and above all an individual who had given utmost importance to collecting facts and understanding them for political praxis, we feel it prudent to organise a seminar in his memory to comprehensively discuss and debate issues concerning the present, past and future of our country.

Read More

### Agenda

| Time | Session | Speakers |
|---|---|---|
| 4th May 2013<br>10:00-14:00 | **Synoptic Session One**<br>Imperialism and the Indian Economy<br>Patterns of Class Formation since Independence<br>Communalisms: Changing Forms and Fortunes Since Independence | Amiya Kumar Bagchi<br>Prabhat Patnaik<br>Aijaz Ahmad |
| 4th May 2013<br>15.00-16.30 | **Industry, Finance, Planning**<br>International Finance And Development in India under Neo-Liberalism<br>Capitalists and Industrialisation in India<br>Planning and the regime of Capital in India | C.P.Chandrashekhar<br>Surajit Mazumdar<br>Chirashree Das Gupta |
| 4th May 2013<br>17.00-18.30 | **Women in Economy and Society**<br>Economic Policies and Women's Work<br>State Policies and Women<br>The Political Economy of Violence against Women. | Jayati Ghosh<br>Smita Gupta<br>Kalyani Menon Sen |
| 5th May 2013<br>9.30-13.30 | **Synoptic Session Two**<br>Agrarian Question and the Post-Independence State<br>Non-Alignment to Dependence: Shifting Paradigms for Foreign Policy<br>State, Market and the Media | Utsa Patnaik<br>Sukumar Muralidharan<br>Sashi Kumar<br>P. Sainath |
| 5th May 2013<br>15.00-16.30 | **The Agrarian Crisis**<br>An Overview<br>Assets, Incomes and Employment<br>Credit,Technology and Public Policy in Indian Agriculture | Venkatesh Athreya<br>Vikas Rawal<br>Ramakumar |

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రసవములలో ప్రథమ సహాయము.

Prasavamulloo prathama sahayamu.

గ్రంథ కర్త

ప్రమాదములలో ప్రథమ చికిత్సయను

గ్రంథమును రచించిన

హానరబులు డాక్టరు. యు. రామారావు

# పీఠిక.



ప్రసవములను గూర్చిన విషయములను మామూలు మాటలలో సులభముగా స్త్రీలకు బోధపడు రీతిని ముఖ్యముగా స్త్రీలకు వివరించుటకే యీ గ్రంథము వ్రాయబడెను. ప్రసవములలో ప్రథమసహాయ పద్ధతి మాత్రమే వివరింప బడెను. అవసరముగా ప్రసవము కలిగినపుడు డాక్టరు గాని మంత్రసాని గాని వచ్చులోగా చేయవలసిన పని మాత్రమే దీనియందు వివరింపబడెను. ఈ ప్రథమ సహాయపద్ధతి తెలియక పోవుటచే చాల మందికి ప్రాణాపాయము గూడ కలుగు చున్నది. డాక్టరుతోను మంత్రసానితోను అవసరము లేకుండచేయుటకీ గ్రంథము వ్రాయబడలేదు. ప్రమాదములు కలిగినపుడు ప్రథమ చికిత్సను చేయుటను గూర్చి నాచే వ్రాయబడిన గ్రంథము నాదరించి నటులే యీ గ్రంథమును గూడ దేశీయు లాదరింప గలరని ఆశించుచున్నాను. ఆ గ్రంథమున కిదివరకే చాల సారులు పునర్ముద్రణములు గూడ జరిగెను. ఈ గ్రంథము ఆంగ్లభాష రానివారికి గూడ నుపకరించుటకు దీనిని యీ రాష్ట్రమునందలి వివిధ దేశ భాషలలోనికి గూడ ననువదింప జేయుచున్నాను.

గ్రంథకర్త.

# విషయముల పట్టిక








# స్త్రీలు ప్రసవించుటలో ప్రథమ సహాయము.



## మొదటి ప్రకరణము.

## వస్తిక (పెల్విసు) వివరణము.

( వస్తికమనగా పొత్తి కడుపు చుట్టునుండు అస్థి పంజరము )

శిశువు తల యేయే మార్గముల గుండ వెళ్ల వలసియుండునో వాని కొలతకంటె శిశువు తల కొలత హెచ్చుగానుండుట వలననే ప్రసవ సమయమునందు కలుగు నపాయములలోను, యిబ్బందులలోను అధికభాగము కలుగుచుండును. కావున యీ భాగముల కూర్పును గూర్చి అందరను కొంతవరకైన తెలుసు కొనవలసిన అవసరము కలిగినది.

బిడ్డ పోవలసిన శల్యద్రోణము (బోనీ బేసిను) నే వస్తిక



ఈ పటమునందు వస్తిక స్థానము చూపబడెను.

(పెల్విసు) మని యందురు. అది వెన్నెముకకును, తొడలకును మధ్య నున్నది. వెన్నెముకపైనాధారపడి వస్తికము తొడలపై నానుకొని యుండును. చాల తరుణాస్థుల (గ్రిజిలు) వలనను గట్టి బంధముల (లిగమెంట్సు) వలనను, కూర్పబడిన చాల యెముకల సముదాయము వలననే యీ వస్తిక మేర్పడినది. దీని కిరుప్రక్కలను కటిపాత్రము (యిలియం) అనబడు వెడల్పగు చదునైన యెముకయున్నది. వస్తికమొక విసనకర్రవలెవిస్తరించియున్నది దాని పై కొనపొడుగునను ఒక దళమగు అంచు కలదు. అందువలననే తుంట్లు స్ఫుటముగా కనబడును. ఈ అంచు ముందు





భాగము వరకు వ్యాపించినది. అచట [illegible] బాగుగా పొటకరించుకొనిన దీనిని గజ్జముడత వెలుపల కొనవద్ద తాకి తెలిసుకొనవచ్చును. రెండు ప్రక్కలనున్న యీ యుచ్ఛ్రితముల (ప్రొజెక్షన్సు) మధ్య భాగము వెడల్పు 9-10 అంగుళములును రెండు కొనల మధ్య భాగము వెడల్పు 11 అంగుళములు నుండును. వస్తికము వెనుక భాగమున త్రికాస్థి (శాక్రం) అనబడు వులి ఆకారము గల యెముక




యొకటి కలదు. దాని ముందు భాగము అరచెయ్యివలె పల్లముగానుండును. త్రికాస్థి అడుగు కొనకు అంటుకొని త్రికాస్థి పుచ్ఛము (కోకిక్సు) అనబడు నొక చిన్నతోకవంటి యెముక కలదు. స్త్రీలు ప్రసవించునపుడు శిశువు తల వెలుపలికి వచ్చుటకు దారికడ్డము కలుగకుండుటకు త్రికాస్థి పుచ్ఛము అనబడు నీ యెముకకొన ఒక అంగుళము సుమారుగా వెనుకకు త్రోయబడును. వస్తికమునకుపీఠముగానున్న ఆసనాస్థి (యిస్చియం) అను యెముక వస్తికముకు, దిగువను వెలుపలను అమర్పబడెను.

వస్తికము ఆకారమును మొత్తమువీద మనము పరిసీలించినచో అది యొక లోతగు మూకుడు (బేసిను) వలెనే యుండును. వస్తికము అంచు వస్తికములోని గుల్లలోనికి పోవీలగు గుండ్రని మార్గమైయున్నది. దాని నుండ పోవునట్టి వన్నియును సూటిగా అధోముఖముగా పోకుండ క్రిందకు వెనుకకు తిరుగుచు నుండుటకు వీలగునట్లు యీ రంధ్రము కొద్దిగా వంచబడును. వస్తికములోని గుల్ల భాగము త్రికాస్థి (శాక్రం) లోని పల్లమువలన వక్రములేని గొట్టము వలె నుండక ముందు వాటముగా వంగియుండును. వస్తికద్వారము చుట్టును పీఠశల్యగ్రంధులున్నవి. ఈ ద్వారము డయమండు ఆకారముతో అధోముఖముగా ముందు వంకగానున్నది. కావున శిశువు జనించునపుడు దాని తల మొదట అధోముఖముగను, వెనుకకును జరుగును. పిమ్మట త్రికాస్థియందలి పల్లముగుండ వక్రముగా ముందుకు పోవును. చివరకు ముందు వంకగా జననేంద్రియ ద్వారమున (ప్యూబిసు) కు దిగువగా వెలుపలికి వచ్చును.



వస్తికము యుండవలసిన సహజ స్థితి.

# రెండవ ప్రకరణము.

## వస్తికము అనగా కటీర చక్రములో వక్రతలు.

వస్తికము ఆకారములో మార్పైమైనుండినచో, ప్రసవ వేదన కలిగిన వెంటనే దానిని కనుగొనినచో కొన్ని శస్త్ర చికిత్సలవలన సుఖ ప్రసవమును కలిగించుటకవకాశము కలదు. దానిని కనుగొనుటలో ఆలశ్యము జరిగిన యడల తల్లికిని పిల్లకునుగూడ అపాయ స్థితి కలుగును. ఏలననగా నీటి తిత్తి పగులుటయును, గర్భాశయము శిశువుకు బాగుగా బిగుసు కొనిపోవుటయును జరిగిన వెనుక శస్త్ర చికిత్సచేయుట చాల కష్టము. కావున వస్తికములో వక్రత కలిగినచో వెంటనే కనుగొని తక్షణమే వైద్యుని రావించుటకు వీలుగానుండుటకు వస్తికములోని సామాన్య వక్రతలను



వక్ర వస్తికము.

గూర్చి గూడ కొంత తెలుసు కొనవలసిన అవసరము కలదు. వస్తికములో కలుగు కొన్ని విధములగు వక్రత లీ దిగువను వివరింపబడెను.

(1) మిక్కిలి చిన్నదిగానుండుట.

(2) చదునుగా మారుట.

(3) నలిగిపోవుట లేక ముడతలు పడుట.

(4) మారురూపు కలుగునట్లు మెలి పెట్టబడుట.

(5) దానిలోపలి భాగమునుండి కలిగిన మొలకలు దాని కడ్డ పడుట.

గర్భవతి ఆకారములో యీ దిగువ చూపబడిన మార్పులు కనబడినచో వస్తికమునందు వక్రతలు కలిగినవని అనుమానింప వచ్చును.



1 2

(1) వెన్ను వంకరగానుండుట.

(2) కాళ్లు వంకరగానుండుట లేక ఒక కాలికంటె మరియొక కాలు పొడుగుగానుండుట.



(3) రొమ్ము లేక వక్షస్థలము వక్రముగానుండుట.

(4) కడుపు ముందుకు వంగుట,



3 4



5

(5) సరిగా పెరుగక పోవుట,

ఈ లక్షణములలో నేదైనను సరే స్త్రీలకున్నచో వారు గర్భవతులైన యెడల డాక్టరులతో నాలోచించి ముందుగానే తగిన యేర్పాటులను చేసుకొనవలెను.

# మూడవ ప్రకరణము.

## గర్భోత్పత్తికి సూచనలు.

గర్భోత్పత్తియైన పిమ్మట సామాన్యముగా చాంద్ర మానమున 10 నెలలకును, యింగ్లీషు మానమున 9 నెల యేడు రోజులకును లేక 280 రోజులకును స్త్రీలు ప్రసవించెదరు. కడపటి బహిష్టయిన మొదటి రోజునుండియు లెక్క ప్రారంభమగును.

### (1) పైత్యవికారము (మోర్నింగుసిక్నెసు)

గర్భోత్పత్తియైన పిమ్మట మొదటి నెలలో కొందరికి వెంటనేను, కొందరికి నెలాఖరులోగాను ఉదయమున పైత్యగాభరా (మోర్నింగుసిక్నెసు) ప్రారంభమగును. కొంతమందికి ప్రసవమగు వరకునుగూడ యెన్నడును యీవికారముబాధమున్నగునవి కనబడకపోవుటగూడకలదు. మరి కొందరికివికారము మిక్కిలి హెచ్చుగానుండును. వారేమి తినినను వెంటనే వాంతి చేసుకొనుచుందురు. ఒక్క మెతుకైన కడుపులో నిలువదు. అట్టిచో వెంటనే డాక్టరును పిలువవలెను. లేనిచో గర్భస్రావము కలుగగలదు. అంతవరకును ఆవగింజల ముద్దను (మస్టర్డు ప్లాస్టరీ)



పొత్తి కడుపుమీద కొద్దిగా వేయవలెను. రెండు గంటల కొకసారి సిరియం ఆక్సొలేటును మూడు గ్రెయినుల యెత్తు మ్రింగించుచుండవలెను. లేదా అరగంట కొకసారి ఒక ఔన్సు నీళ్లలో టింక్చరు ఆఫ్ అయోడిను ఒక చుక్క వేసి త్రాగించుచుండవలెను. అందరికిని గూడ ఉదయమున నిద్ర లేవగానే వికారము కలుగును, గర్భోత్పత్తియై 12 వారములు గడువగానే యీ బాధ తగ్గిపోవును. అనగా నాల్గవ నెల రాగానే తగ్గిపోవును.

### (2) ఋతు స్రావము కట్టుబడి పోవుట

గర్భోత్పత్తికలుగకపూర్వముసరిగా 28 రోజులకొకసారి బహిష్టగుచున్నచో అట్టి స్త్రీలకు గర్భోత్పత్తియైనయెడలఋతుస్రావము కట్టుబడి పోవును.



ఇదినమ్మకమైనలక్షణము. క్రొత్తగా కాపురమునకు వచ్చిన పడుచులకు గర్భోత్పత్తి కాకుండనే వరుసగా మూడు నాలుగు నెలల వరకును ఋతుస్రావము నిలచిపోవుచుండును. కొంతమంది గర్భవతులైన పిమ్మట మూడు నాలుగు నెలల వరకును ఋతు

స్రావము వెడలుచునేయుండును. మరి కొందరికి ప్రసవమగువరకును గూడ ఋతు స్రావము వెడలుచునే యుండును. ఈ కడపటిపద్ధతులు అసాధారణములలో చేరినవి. కావున గర్భోత్పత్తి కలిగి నట్లు నిర్ధారణ యగుటకు డాక్టరు నడుగుటయే ఉత్తమము.

(3) స్తనములు పెరుగుట: సాధారణముగా మొదటి నెల నిండగానే పాలిండ్లు పెరుగనారంభించును.

(4) పాలిండ్లు నొప్పిగానుండుట, చనుముక్కులు నల్ల బడుట: మూడవ నెలలో నీలక్షణములు కనబడును, కొందరికి తెల్లగానుండు పలచని నీరు గూడ పాలిండ్లనుండి స్రవించుచుండును,

(5) కడుపు పెరుగుట:

(6) శిశువు కదలుట: నాలుగవ నెలలోను అయిదవ నెల లోను కడుపులో శిశువు కదలుట చాలింతరాలికి తెలియును, అపుడు చాల మందికి చాలనిస్త్రాణగాగూడనుండును.

(7) కడుపులోనున్న శిశువు గుండెకొట్టుకొనుట: తలగడ క్రింద వాచీని పెట్టుకొనిన దాని ధ్వని యెంత మెల్లగా విన బడునో అటులనే కడుపులోనున్న శిశువు గుండెలు కొట్టుకొను చున్న



ధ్వని మొదట అయిదవ నెలలో అంత మెల్లగా వినబడును, తరువాత నది క్రమముగా స్పష్టముగా వినబడుచుండును. తుంటియెముకవద్దనుండి బొడ్డు వరకును ఒక గీతను గీసినచో దానికి మధ్యగా నొకపుడు కుడి ప్రక్కను మరొకపుడు యెడమ ప్రక్కను యీ ధ్వని వినబడును.

(8) కడుపులో శిశువు బాగుగా తిరుగుట: ఆరవ నెల నిండిన పిమ్మట పట్టి చల్లని చేతిని క్రింది కడుపుమీద పెట్టినచో యీ కదలిక బాగుగా చేతికి తగులును.

(9) గర్భవతి భావములు మారుచుండుట, జిహ్వాచాపల్యము, కోరికలు: గర్భవతికి అనేక క్రొత్త వస్తువులపైని కోరిక కలుగుచుండును. కొందరు విజాతి పదార్థములనుగూడ తిన గోరుచుందురు.

నోటిలో లాలా జలము విస్తారముగా కలుగుట, కాళ్ల నరములు పొంగుట, పంటినొప్పి మున్నగునవి గూడ కొందరికి కలుగును,

గర్భవతి కాగానే ప్రతి స్త్రీయును తన పళ్లను దంత వైద్యునిచే విధిగా పరీక్ష చేయించు కొనవలెను. వానిలో నేదైన లోపము లున్నచో వెంటనే చికిత్సగూడ చేయించు కొనవలెను.

## నాల్గవ ప్రకరణము.

## కడుపుతోనున్న రోజులలో స్త్రీల ఆరోగ్యము.

సుఖ ప్రసవము కలుగవలె ననియును, అందమును ఆరోగ్యమును గల శిశువు జనింప వలెననియును కోరు స్త్రీలు నెల తప్పినది మొదలు శిశువు జనించు వరకును నవ మాసములును ఆరోగ్య విషయమున చాల శ్రద్ధను చూపవలెను. చూలు నిలుచుట స్త్రీలకు చాల సహజ ధర్మమే గాన సరియగు నంగ సౌష్టవము గల స్త్రీలు ఆరోగ్యమును గూర్చి శ్రద్ధ వహించుచున్నచో సుఖ ప్రసవమును గూర్చి యెట్టి ఆందోళనమును చెంద నవసరము లేదు. ఆరోగ్యవతులుగా నున్నవారు పద్ధతులను అలవాటులను మార్చ నవసరము లేదు. ఆహారము, బట్టలు, మంచి గాలి, కాల విరేచనము మున్నగువాని విషయమున మాత్రము శ్రద్ధ కలిగి యుండవలెను.

### ఆహారము.

రుచులను పూర్తిగా వదల నక్కర లేదు గాని, రుచులకే ప్రాధాన్య మియ్యగూడదు. త్వరగా జీర్ణమగునట్టియు పుష్టి నిచ్చునట్టి



యు ఆహారమును బాగుగా తినుచుండవలెను. కడుపులోనున్న శిశువుకు గర్భవతి రక్తమునుండియే పుష్టి కలుగుచుండును. కావున పుష్టికరములగు పదార్థములనే తినుచుండ వలెను. లేనిచో శిశువు లోపల సరిగా పెరుగదు. జిహ్వా చాపల్యము వలన అనారోగ్యకరములగు చిరుతిండ్లను తినగూడదు. చాల కారమును ఘాటును గల వస్తువులను వూరగాయలు పచ్చళ్ళుమున్నగు వానిని వీలైనంతవరకు వదలి వేయవలెను. మంచి పాలను విస్తారముగా త్రాగుచుండవలెను. సరిగా కాల విరేచనమగుటకు, పండ్లను, వుడికించిన ఆకు కూరలను, విస్తారముగా తినుచుండ వలెను. మలబద్ధము కలిగినచో ఆరోగ్యమునకు భంగము కలుగుటయే గాక ప్రసవ సమయమున గూడ సుఖ ప్రసవము కలుగుటకభ్యంతర మేర్పడును. నెలలు హెచ్చిన కొలదియు ఆహారమును తగ్గించుచుండవలెను గాని రోజుకు మూడు నాలుగు సారులు కొద్ది కొద్దిగా తినుచుండ వలెను. మలబద్ధము కలిగినచో రాత్రి పరుండ బోవునపుడు రెండు మొదలు నాలుగు మిల్లీ గరిటెల (టీ స్పూను) ఆముదమును ప్రతిదినమును త్రాగుచుండవలెను. ఆముదమును త్రాగ లేనిచో రాత్రి పరుండ బోవునపుడు పాలలో ఒకటీ స్పూను లికోరిసు పవుడరును కలిపి త్రాగుచుండవలెను, అది గూడ సరి పడనిచో డాక్టరును కనుగొన వలెను.

## బట్టలు.

భారత దేశమునందలి శీతోష్ణ స్థితిని బట్టియు యిచట స్త్రీలు చీరలను కట్టు పద్ధతిని బట్టియు గర్భవతులు బట్ట కట్టుటలో నెట్టి మార్పును చేయ నవసరము లేదు. సాధారణముగా మన దేశమున స్త్రీలు చాల సన్నని చీరలనే వదులుగా కట్టెదరు గాన, శరీరమున రక్తము సరిగా ప్రవహించుట కెట్టి అభ్యంతరమును కలుగదు. రక్తము అన్ని అవయవములకును సరిగా పోవుచునేయుండును. రొమ్ము పైనను కడుపు పైనను బట్ట నెప్పుడును కప్పియే యుంచవలెను గాన వూలు చొక్కాను తొడుగుకొని యుండుట మంచిది. ఆకస్మికముగ శీతోష్ణ సంబంధములగు మార్పులు వీనికి తగులగూడదు. వేసవి కాలములో వూలు చొక్కాను తొడుగుట స్త్రీలకు కష్టముగా తోచవచ్చును గాని వూలు వేడిని ఆకర్షింపదు. తేమను బాగుగా హరింప జేయును గాన వేసవిలో చెమటను ఆర్చివేయును. శీత కాలములో శరీరమునందలి వేడిని నిలిపియుంచును. బిగువగు పటకాలను, వడ్డాణములను గర్భవతులు పెట్టుకొన గూడదు.

## విశ్రాంతి.

గర్భవతులు యే పనులను చేయగూడదనియును మామూలు గృహకృత్యములను గూడ చేయగూడదనియును చాల మంది భావించు



చుందురు. బరువువస్తువులను పైకెత్తుట, బరువు పదార్థములను మోయుట పరుగెత్తుట శరీరమున కధికమగు నలసట కలుగజేసుకొనుట మున్నగు పనులు చేసినచో చాల హాని కలుగుట నిశ్చయమే కాని తగిన శరీర పరిశ్రమ చేయక పోవుట గూడ మంచిది కాదు. ఆరోగ్యవతియగు స్త్రీ ఎనిమిదవ నెల వచ్చువరకును మామూలుగా గృహకృత్యముల నన్నిటిని చేయుచునే యుండవచ్చును, ఆరోగ్యము సరిగా నుండుటకు శరీరమునకును మనసునకును తగుమాత్రమగు పరిశ్రమ ముఖ్యావసరమే యగును. సాధారణముగా రోజుకు ఒక గంట ఆరు బయట శరీర పరిశ్రమను చేయదగును. కాని భారత దేశమునందలి ఆచార వ్యవహారములు, పద్ధతులు మున్నగు వానిని బట్టి చాలమందికిది సాధ్య పడదు, ఆరు బయట షికారు వెళ్లుటకు గూడ చాల మందికవకాశము కలుగదు. కావున వారిండ్లలోనైన లేచి తిరుగుచు గృహ కృత్యములను చేయుచుండుట చాల అవసరమే యగును, గర్భవతి పరిశుభ్రమగు గాలిని విస్తారముగా పీల్చుచుండవలెను. లేనిచో ఆమెకును, లోనున్న శిశువునకునుగూడ అనారోగ్యస్థితి కలుగును.

## అయిదవ ప్రకరణము.

### చూలింత రాండ్రకు కలుగు జబ్బులు.

(1) విస్తారముగా వాంతులగుట:-గర్భవతులకు కలుగు వేవిళ్లకు యెట్టి చికిత్సయును అవసరములేదు సరిగా విరేచనమగుటకు మాత్రము సాధనముచేయు చుండవలెను. ఉదయమున నిద్రలేవగానే నోరుపట్టగలిగి నంతోటి వేడివేడి నీళ్లను ఒకగ్లాసునీళ్లుపీల్చి త్రాగుచున్నచో వికారమును వాంతులును తగ్గును. కొంత మందికి యేమి తినినను గూడ వాంతి యగుచునే యుండును. వారు ఆహారము లేక మాడవలసిన గతిలో నుందురు. లోపల నేమియును నిముడదు. అట్టి స్థితిలో డాక్టరు నడుగవలసి నదే. అతడు వచ్చులోపల 15 నిముషముల కొకసారి ఒక ఔన్సు నీళ్లలో ఒక చుక్క టింక్చరు ఆఫ్ అయోడిను వేసి త్రాగించుచుండవలెను.

(2) మూత్ర పిండ వ్యాధులు:—నెలలు ముదిరిన పిమ్మటనే సాధారణముగా మూత్ర పిండ వ్యాధులు కలుగును. ఈ వ్యాధులున్నచో బలమైన తలనొప్పి దృష్టి మాంద్యము, మూత్రము కొద్దిగా



పోవుట, మూత్రములో శ్వేత ధాతువు విస్తారముగా పడుచుండుట శరీరమంతయును ముఖ్యముగా ముఖమును పొంగుటమున్నగు లక్షణములు కలుగును. అపుడు మిన్నకుండ గూడదు. మిన్నకున్నచో విస్తారముగా యీడ్పులు కలుగును. తల్లియును శిశువును గూడ అపాయ స్థితిలో నుందురు. వెంటనే డాక్టరును పిలుచవలెను, ఈలోగా పాలను మాత్రమే త్రాగించుచుండవలెను. విరేచనము సరిగా నగుటకు సాధనము చేయవలెను.

(3) రక్తము పలచబడుట:—రక్తము పలచబడినచో చూలింతరాలు పాలిపోవును. కాళ్లును, గుహ్యాంగములును వాచును. వెంటనే వైద్యుని సహాయమవసరము. అంతవరకును రోగిని ఒరిగియుండునట్లు పరుండ బెట్టవలెను. బాలీసు మున్నగు వాని కానుకొని పరుండవలెను

(4) రక్తనాళములు ఉబ్బుట:—క్రింది అవయవములలోని రక్తనాళములు తరుచుగా విస్తారముగా ఉబ్బును. ఒకపుడు పగులుటకు గూడ సిద్ధమగును. ఆ భాగమునందు రబ్బరుతో గాని, సాగునట్టి స్వభావముగల మరియొక దానితో గాని తేలికగా కట్టు కట్టవలెను. కాలి వ్రేళ్ల వద్దనుండి కట్టుట (బాండేజి) ప్రారంభించి పైకి కట్టుకొని పోవలెను. నడువగూడదు. కాలికి విశ్రాంతి నియ్యవలెను.

(5) పచ్చకామెల వ్యాధి:—గర్భవతులలో కొందరికి పచ్చకామెల వ్యాధిలో చాల ప్రాణాపాయకరమగు రకము పచ్చకామెల వ్యాధిగూడ కలుగుచుండును. చూలింతరాలి మూత్రము మిక్కిలి పచ్చగానుండినను, ఆ మూత్రము బట్టమీద పడినచో బట్టకు పసుపు డాగు కలుగుచుండినను కనులలోని తెల్లగ్రుడ్లు గూడ పసుపు రంగుగా మారినను, విరేచనము మట్టి రంగుగానుండినను తక్షణమే వైద్యుని పిలువవలెను.

(6) మూలశంఖ లేక మూల వ్యాధి:—గర్భవతులు మూలశంఖవలన చాల బాధ పడుచుందురు గాని ప్రసవించగానే చాల మందికీ వ్యాధి తగ్గిపోవును. రాత్రి పరుండ బోవునపుడు పాలలో రెండు టీ స్పూనులు ఆముదము వేసి గాని ఒక టీ స్పూను లికోరిసు పౌడరును వేసి గాని త్రాగుచుండుట కంటె గర్భవతులకు మరే చికిత్సయును యిందులకు చేయ వీలులేదు. ఇటుల పుచ్చుకొనుచున్నచో ఉదయమున పిష్టము కట్టకుండ విరేచనము సరిగా నగుచుండును వీని వలనగూడ విరేచనము కానిచో వైద్యుని పిలువవలెను. మొలకలపైని వేడినీళ్ల కాపటము పెట్టవలెను. కరక్కాయల ఆయింటుమెంటు, నల్లమందు ఆయింటుమెంటు, హేజిలీను మున్నగువానిని పైన రాయవలెను. అవి శాంతి ప్రదములుగా నుండును.



(7) గుహ్యాంగములలో దురద:—కొంతమంది స్త్రీలకీ దురద వలన భరింపరాని బాధ కలుగును. స్రావము వలనను, అతి మూత్ర వ్యాధి వలనను గూడ నీ దురద కలుగును. వైద్యునికి తెలుపవలెను. ఈలోగా రోజుకు రెండు మూడు సారులు వెచ్చని నీళ్లలో బొరాక్సును కలిపి గుహ్యేంద్రియములను తడుపుచుండవలెను. తరువాత జింకు ఆయింటుమెంటు రాయవలెను.



## ఆరవ ప్రకరణము.

## గర్భవతులకు కలుగు అపాయములు.

గర్భస్రావము, అకాలప్రసవము మున్నగు నపాయములు గర్భవతులకు కలుగుచుండును.

### (1) గర్భస్రావము

నాలుగవనెల రాకముందే గర్భాండము వెలుపలకు వచ్చినచో దానిని గర్భస్రావమందురు. అధికమగు భీతి, విపరీతమగు దుఃఖము, గొప్ప అపటు ఘోరవార్తను వినుట, భయంకరము లగువానిని చూచుట, మున్నగువాని వలనను, ఆకస్మికముగ భావోద్రేకము కలుగుట వలనను, గాఢములగు విరేచన సాధనముల వలనను, అధికముగ జ్వరమువచ్చుట వలనను గూడ గర్భస్రావముకలుగును. ముందుగా కడుపునొప్పియును, రక్తస్రావమును తోలుదొత్త కలుగును. అది కలిగిన వెంటనే చికిత్సచేయించ వలెను. వైద్యుడు వచ్చులోగా గర్భవతి శాంతముగా పరుండునట్లు చేయవలెను. చూలింతరాలు పాలిపోవుట



సొమ్మసిలుట, వంటినిండ జిగటగానుండు చెమట బట్టుట మున్నగునవి కలిగినచో గర్భాశయమునుండి రక్తముస్రవించు చున్నదని గ్రహింపవలెను. ఆమార్గమునకు గుడ్డబంతి సడ్డుపెట్టి రక్తస్రావమును నిలుపుటకు ప్రయత్నించవలెను. ఇందులో నంతకష్ట మేమియును లేదుగాని, శ్రద్ధమాత్ర మవసరము. స్టెరిలైజుచేసి సిద్ధపరుపబడిన గాజు పేలికలున్నచో వానిని తీసుకొనవలెను. అవిలేనిచో అరగంటసేపు గాజును (ఒకరకముగుడ్డ) నీళ్లలో వేసి బాగుగా మరుగనిచ్చి పిమ్మట ఆ గుడ్డపేలికలను వాడవలెను. ఈ పేలికలను గర్భాశయముయొక్క మెడచుట్టును గట్టిగాదోపవలెను. పిమ్మట యీ రీతినే స్టెరిలైజుచేయబడిన దూదివుండలను దాని పొడుగునను బాగుగా బిగించిపెట్టవలెను. ప్రతివుండను గూడ గట్టిగా నొక్కిపెట్టవలెను. ఈ రీతిగా దానిలో పట్టునన్ని వుండలను బిగించి పెట్టినవెనుక గర్భవతిని వెల్లకిల పరుండ బెట్టవలెను. గుహ్యాంగములను కప్పుటకొక రుమాలును వానిపైనివేసి దానిపైని విశాలమగు నొక పట్టీతో కడుపుచుట్టును గట్టిగా కట్టవలెను. ఈ పనులనన్నిటిని చేయజాలనిచో చూలింతరాలిని వెల్లకిల పరుండబెట్టి గుహ్యాంగములపైని తడిబట్టను కప్పుచుండవలెను. తత్క్షణమే డాక్టరును పిలువనంపవలెను.

## (2) అకాల ప్రసవము

28 వారములలోగా అనగా శిశువుకు జీవశక్తి కలుగకముందే బిడ్డపుట్టినచో పిండస్రావము అనియును, 28 వ వారము గడచిన వెంటనే శిశువుజనించినచో అకాల ప్రసవమనియు నందురు. ఈ అపాయము కలుగనున్నపుడు గూడ డాక్టరును పిలువవలెను. అతడు వచ్చువరకును 24 వ పేజీలో తెలుపబడెడు రీతిని మామూలు ప్రసవమునందు పుచ్చుకొనునట్టి జాగ్రతలనే యిపుడు గూడ పుచ్చుకొనవలెను.

1. రక్తస్రావము
2. విస్తారముగా వాంతులు
3. తలనొప్పి, దృష్టిమాంద్యము, చేతులు ముఖము పొంగుట
4. పచ్చ కామెల
5. వస్తికమున వక్రతకలదను అనుమానము
6. మూత్రము నిలువకుండ పోవుట లేక మూత్రముపోవునపుడుబాధ, మూత్రముసరిగా పోకుండుట మున్నగునవి కలిగినపుడు యేమాత్రమును ఆలస్యము చేయకుండ వెంటనే డాక్టరును పిలువవలెను.

## ఏడవ ప్రకరణము.

## సహజమగు ప్రసవవేదన లేక సుఖ ప్రసవము.

ప్రసవ వేదన అనగా శిశువు జనించుటకు ముందు జరుగు పద్ధతి. తొమ్మిది నెలలును నిండిన పిమ్మట కలుగు ప్రసవము సహజమైనది గావున అట్టి ప్రసవమునందు ప్రమాదము చాల తక్కువగా నుండును. ప్రసవ వేదన త్వరలో ప్రారంభమగు ననగా యీ దిగువ లక్షణములు మాలింతరాలికి కలుగును:—కడుపు ముందుకు అధోముఖముగా వ్రాలును. వళ్లు చాల తేలికగా నున్నట్లామెకు తోచును. తరుచుగా మూత్ర విసర్జనము చేయుటకు బుద్ధి పుట్టును. మల ద్వారము గుండ జిగట పడును. ఒకపుడు రక్తపు జాడ గూడ జిగటలో కనబడును. కొందరికి ఒకటి రెండు రోజులు ముందుగాను కొందరికి కొన్ని గంటలు ముందుగాను యీ లక్షణములన్నియును గాని, కొన్నిగాని కనబడును. కొన్ని



సహజమగు ప్రసవమునందు శిశువు తల యుండు రీతి.

రోజులు ముందుగా కానుపునొప్పులవంటి నొప్పులు కొందరికి కలుగును. మరికొందరికి కొద్దిగా రక్తము గూడ పడును. రక్తము పడినచో తక్షణమే డాక్టరును పిలువవలెను. ఈ నొప్పులలో (1) వట్టినొప్పులు, (2) నిజమైననొప్పులు అని రెండు రకముల నొప్పులున్నవి. వట్టినొప్పులు కాల నిర్ణయము లేకుండనే వచ్చుచుండును. గాని అవి చాల సేపుండవు. బహు కొద్దికాలమే యుండును. అవి ముందు భాగముననే సామాన్యముగా కలుగును. జీర్ణకోశమునందును, మలకోశమునందును లోపమేదైన కలుగుట వలనను అజీర్ణకారియగు పదార్థమును తినుట వలననుగూడ నిట్టి వట్టినొప్పులు కలుగును. వెంటనే ఒక మోతాదు అముదమును త్రాగవలెను. తేలికగా అరుగునట్టి ఆహారమునే తినుచుండవలెను.

(2) నిజమైన నొప్పులు:—శిశువు జనింపనున్నతరిని కలుగు నొప్పులు నిజమైన నొప్పులు. మొదటి నొప్పి వచ్చిన యెన్ని నిముషములకు రెండవ నొప్పి వచ్చునో దాని తరువాత సరిగా అంతకాలమునకే మరల నొప్పి వచ్చుచుండును. ఈ నొప్పులు మొదట చాల తక్కువగానుండును. తరువాత చాల హెచ్చగును. పిమ్మట పూర్తిగా నిలచిపోవును. ఈ నొప్పి మొదట వెన్నులో నారంభించి పొత్తికడుపు



దిగువ భాగమునకు పోవుచుండును. ఈ నొప్పులతో పాటు స్రావము కూడ కలిగినచో, నిజమైన నొప్పులారంభమైన వని తెలుసుకొనవలెను.

ఈ లక్షణములు కలిగిన వెంటనే పురిటి గదిలో ప్రక్క నమర్చవలెను. గట్టిగానుండు మెత్తనుగాని, కర్ర పలకలమర్చబడిన కర్ర మంచమునుగాని వేయవలెను. దాని మీద బ్లాంకెటును, ప్రక్క దుప్పటిని పరచి వాని పైని ఆయిలు క్లాతు ముక్కను గూడ వేసియుంచవలెను, అప్పటికి ఆరు గంటలలోగా విరేచనమయ్యుండనిచో వేడి నీళ్లలో సబ్బు కలిపి దానితో యెనీమా చెయ్యవలెను. లేదా ఒక మోతాదు ఆముదమును త్రాగించవలెను. ప్రసవ సమయమున బాగుగా విరేచనమైనచో గర్భాశయము సరిగా పనిచేయ గలుగును, పరిశుభ్రముగానుండును. యిబ్బంది యేమియును కలుగదు లేనిచో నొప్పులు బలమైనపుడు మలము ప్రక్కమీద విధిగా పడును.

ప్రసవ వేదనలో మూడు అంతరువులున్నవి:—

## మొదటి అంతరువు.

నిజమైన నొప్పులారంభమగుటయే మొదటి అంతరువు. అప్పుడు కడుపు దిగువ భాగమున నొప్పి ప్రారంభమగును. క్రమముగా నడుము

లోనికిని, వెన్నులోనికిని వ్యాపించును. అటునుండి తొడలలోనికి గూడ దిగును. వీనినే కానుపు నొప్పులందురు. గర్భాశయ ద్వారము బాగుగా విడిపోవు వరకును యీ నొప్పులుండును. ఆ ద్వారము పూర్తిగా విడిపోగానే సాధారణముగా శిశువును కప్పియుండు నీటి సంచి పగిలి ద్రవ్యమంతయు నీరువచ్చును. తొలిచూలు వారికి 11-12 గంటల వరకును. తరువాత కానుపులకు 6-8 గంటల వరకును యీ నొప్పు లుండును. అంతకంటె అధిక కాలము వరకును యీ నొప్పులు తగ్గకున్నచో యేదో లోపమున్నదని గ్రహించి వెంటనే డాక్టరును పిలువవలెను. డాక్టరు వచ్చువరకును చూలింతరాలు అటునిటు నడుచుచునేయుండవలెను. అప్పుడు శిశువుయొక్క భారము క్రిందకు దిగును గాన దానివలన గర్భాశయ ద్వారము విడిపోగలదు.

## రెండవ అంతరువు.

గర్భాశయ ద్వారము పూర్తిగా విడిపోయినది మొదలు శిశువు జనించు వరకును రెండవ అంతరువు అనబడును. రెండవ అంతరువులో నొప్పులు చాల అధికమగును. ఒక నొప్పికిని మరియొక నొప్పికిని మధ్య విరామము గూడ చాల తక్కువగును. ఒకసారి నొప్పి వచ్చినచో 30 మొదలు 60 సెకనులవరకునుండును. ఒక



నొప్పి తగ్గిన పిమ్మట మరి 5-6 నిముషములకే మరల నొప్పి వచ్చుచుండును. శిశువు జనించ బోవువరకును యిటులే నొప్పులు వచ్చుచుండును. అప్పుడు మాత్రము నొప్పులు విడువకుండనే యుండును. మొదటి అంతరువునందలి బాధకంటె రెండవ అంతరువులోని బాధ మిక్కిలి హెచ్చుగానుండును, మొదటి అంతరువులో అరచినట్లు రెండవ అంతరవులో చూలింతరాండ్రు అరువరు గాని బాధనంతను దిగ్రమింగుచు గట్టిగా మూలుగుచుందురు. నొప్పివచ్చినప్పుడు చేతికేదియందిన దానిని గట్టిగాపట్టుకొని బాధను భరించుటకుసర్వశక్తులను వినియోగించుచుందురు. అట్టి స్థితిలో చూలింతరాలిని పరుండ బెట్టవలెను. తలవైపున మంచమున కొక బట్టను బిగించి కట్టవలెను. నొప్పి వచ్చినపుడు దానిని భరించుట కాధారముగా ఆ బట్టను చూలింతరాలు పట్టుకొనుచుండును. లోపల శిశువు క్రిందకు దిగిన కొలదియు మలకోశమునకు వత్తిడి అధికమగును. అప్పుడు విరేచనము కానున్నట్లు చూలింతరాలికి గట్టి అనుమానము కలుగును. తొలిచూలు వారికి రెండవ అంతరవు ఒకటి రెండు గంటలుండును. ఇతరులకు 10-15 నిముషములు మాత్రమే యుండును. అంతకంటె హెచ్చుకాలము వరకున్నచో నేదో అసహాజస్థితి కలిగినదని భావించి వైద్యుని పిలువ నంపవలెను. శిశువు

తల సహజముగాను యెట్టి ఆలస్యమును లేకుండను వెలుపలకు వచ్చినచో శిశువు మెడచుట్టును బొడ్డు నరము (కార్డు) చుట్టుకొని యున్నదేమో చూడవలెను. అది చుట్టుకొనియున్నచో శిశువు శరీరము దాని గుండ వెలుపలికి రావీలగునట్లు దానిని తల పైకి త్రోయవలెను. లేదా వదులుచేయవలెను, ఈ రెండునుగూడ సాధ్యముకానిచో కత్తెరతో నానరమును కత్తిరించవలెను. అందువలన రక్తస్రావము కలుగకుండ ఆ నరము రెండుకొనలను ముడివేయవలెను,

## మూడవ అంతరువు.

శిశువు జనించినది మొదలు మావి పడిపోవువరకును మూడవ అంతరువనబడును. శిశువు పుట్టినపిమ్మట 15-30 నిముషముల లోగానే అందరికిని గూడ మావి పడిపోవును. అటుల పడనిచో డాక్టరును పిల్లువవలెను. శిశువు పుట్టినవెంటనే తల్లికి అధికమగు నుపశమనము కలుగును. అందువలన 10-15 నిముషములవరకును సొమ్మసిలినట్టు పరుండియుండును. అటుపిమ్మట మరల నొప్పులు వచ్చును. మావిపడిపోవువరకును అటులనే కొన్ని నిముషముల కొకసారి నొప్పులు వచ్చుచునేయుండును.

సహజమగు ప్రసవములో శ్రద్ధపుచ్చుకొనవలసిన ముఖ్యవిషయములు మూడు.



(1) శిశువుతల వెలుపలికి వచ్చునపుడు తల్లి శరీరము నందేభాగమున ఒత్తిడి కలుగునో ఆ భాగమునకు అనగా జననద్వారము (పెరినియం) అనబడు వస్తికమునందొక భాగమునకు తగినంత ఆసానుయియ్యవలెను. లేనిచో అది చీలిపోవును. తొలిచూలు వారికీ విషయమున అధికమగు శ్రద్ధ అవసరము, చేతిమీద శుభ్రమైనబట్టను వేసుకొని చేతులతో గట్టిగా ఆ భాగమును పట్టుకొనినచో అదియే మంచి ఆసానగును.

(2) శిశువు నోటిలో నున్న చీము, మైల మున్నగువానిని తీసివేయవలెను.

(3) శిశువు జనించిన వెంటనే గర్భాశయద్వారము మూసుకొనిపోవునట్లు చూడవలెను, అందులకు శిశువు జనింపగానే దగ్గిరనున్న స్త్రీలలోనొకరు బాలింతరాలి గర్భాశయ ద్వారముపై చేయివేసి ఒక మాదిరగా అణచిపెట్టుచుండవలెను. మావిపడి పోవువరకుగాని లేక ఆ ద్వారము పూర్తిగా మూసుకొని పోవువరకుగాని చేతినితీయగూడదు. ఆ ద్వారము మూసుకొని పోయినచో మలకోశము దిగువను ఒక గట్టి గుండ్రని బంతివలె చేతికితగులును. ఆ ద్వారమటుల మూసుకొనిపోనిచో రక్తస్రావము కలుగవచ్చును. అప్పుడు వెంటనే డాక్టరును పిలువవలెను.

(4) బొడ్డు కోయుట:— (ఈ విషయమును గూర్చి 9 వ అధ్యాయము చూడవలెను)

నొప్పులు పడుచున్నపుడు దాహము విస్తారముగా నున్నచో చల్లనినీళ్లను గాని మంచు గెడ్డవేసిన పాలనుగాని త్రాగ నియ్యవలెను.



గట్టి ఆహారమునియ్య గూడదు. ఇచ్చినచో వాంతులు కలుగ గలవు. ఒక నొప్పికిని మరియొక నొప్పికిని మధ్య విరామములో గర్భవతికినిద్ర పట్టినచో నిద్రా భంగము కలిగింప గూడదు. మావి పడుట ఆలస్యమైనపుడు అది త్వరగా పడిపోవలెనని తొందర పడి నరమును (కార్డు) లాగగూడదు. మావి పడునప్పుడుగూడ నొప్పులు కలుగును. కొంత మందికి మావి గర్భాశయద్వారము (ఆరిఫిసు) కడకువచ్చి నిలచి పోవును గాని యీ వలికి రాదు. అపుడు దానిని మెలిపెట్టి క్రమముగా తీసివేయవలెను.



మావి యెక్కడనైన తెగిపోయినదో లేక పూర్తిగా వెలికి వచ్చినదో బాగుగా పరీక్షించి చూడవలెను. అది తెగిపోయి నట్టున్నచో లోపల కొంత భాగముండియుండును గాన నపుడు డాక్టరును పిలువ వలెను.



# ఎనిమిదవ ప్రకరణము

## శిశువు పుట్టినపిమ్మట జరుగవలసిన పని.

మావిని తీసివేసిన పిమ్మట పొత్తికడుపుకు కట్టుకట్టవలెను. బాలింతరాలు వెల్లకిల పరుండియుండగా కట్టు పట్టీని కడుపుకు చుట్టు పెట్టవలెను. దానిని వెన్నుక్రింద నుండి మెల్లగా రానియ్యవలెను, ఒకప్రక్క నొకరుండి దానిని వెన్నుక్రింద దోపినపుడు రెండవప్రక్క నింకొకరుండి దానిని లాగవలెను. బాధకలుగకుండునట్లును, గట్టిగాను ఆ పట్టీని కడుపుకు చుట్టి సేఫ్టీపిన్నులను దానికి గ్రుచ్చవలెను. మొదట పైభాగమున పిన్నును గ్రుచ్చవలెను. ఈ పట్టీ చాల వెడల్పుగా నుండవలెను, సన్నముగానుండ గూడదు. గర్భాశయమొక గుండ్రని గట్టియుండ వలె చేతికి తగులనిచో ఒక రుమాలును మడతలు పెట్టిగర్భాశయము పైని పొత్తికడుపు చుట్టును కట్టబడిన పట్టీక్రింద దోపవలెను. అపుడు గర్భాశయమునకు సరియైన నొక్కుదల కలుగును. తరువాత శిశువును తల్లి ప్రక్కలో పరుండబెట్టి తల్లిరొమ్మును శిశువునోట పెట్టవలెను. అందువలన గూడ గర్భాశయము ముడుచుకొని పోగలదు. గర్భాశయిముపై పెట్టబడినరుమాలు మడతను మరునాడు తీసివేయవచ్చును గాని పొత్తికడుపు కట్టును మాత్రము



బాలింతరాలు మంచము మీదనుండి లేవగలుగువరకును తీయగూడదు. పొత్తికడుపుకు కట్టుకట్టి సరిచేసిన పిమ్మట బాలింతరాలి ప్రక్కమీద నుండి మాసిన గుడ్డలనన్నిటిని తీసివేయవలెను. ఒక పైంటు వేడినీళ్లలో ఒక టీ స్పూను లిసలు ద్రావకమును కలిపి ఆ నీళ్లలో ఆ గుడ్డలను ముంచి వుతికి ఆరవేయవలెను. ప్రక్కను శుభ్రపరచి తాజాతువాలు (సానిటరీ టవెలు) ను పరువవలెను. 90 నిమిషముల వరకును బాలింతరాలు కదలకుండ పరుండవలెను. నిద్రపట్టినచో మేలే. పట్టకున్నను కదలకుండ పరుండియుండవలెను. బాలింతరాలు ప్రసవము కాగానే లేచి కూర్చున్నచో విధిగా రక్తస్రావము కలుగును గాన, అటుల నెన్నడును కూర్చుండ గూడదు. ఇది చాల ముఖ్యతరమని తెలుసుకొనవలెను. రక్తస్రావము కలుగుటకుగల తక్కిన కారణము లన్నిటిలోను యిదియే ముఖ్యతమము. ప్రసవ సమయమువ బాలింతరాలికి అలసట చాల మెండైనచో శిశువు కలిగిన పిమ్మట నామె మిగుల సోలిపోయి యుండిన యడలను, రక్తస్రావము కలుగక పోయిన యడలను, టీనిగాని, కాఫీనిగాని, డికాక్షను విస్తారముగా వేసి త్రాగించ వలెనుగాని, దానిని గోరువెచ్చగా చల్లారనిచ్చి త్రాగవలెను గాని, మిక్కిలి వేడిగా త్రాగగూడదు. అటుల త్రాగించిన చాల ఉత్సాహము కలుగును. రక్తస్రావము కలిగినచో పాలలో మంచుగెడ్డవేసి ఆ పాలను త్రాగించ వలెను. ఇటులగంట

న్నరసేపునకు తక్కువగాకుండ బాలింతరాలు విశ్రమించిన పిమ్మట గుహ్యాంగములను మరల కడిగి పొడిగానుండు తాజా చేతిరుమాలును వాని పైని కప్పవలెను. సాధారణముగా నప్పటికి కొంతరక్త స్రావముగాని, రక్తపు తునకలుగాని కనబడును. కావున యీ రీతిగా 4-5 రోజుల వరకును ఆ భాగములను ప్రతిదినమును చాలసారులు పరిశుభ్రముగా కడుగుచునే యుండవలెను. పెద్దపురుడు పదిరోజులలోను బాలింతరాలికి యెట్టిఉద్రేకమును కలుగగూడదు. చాలమంది ఆమెను చూడ వచ్చినచో విధిగా వుద్రేకము కలుగును. గాన పురిటి గదిలోనికి యెవ్వరిని రానియ్యగూడదు. ముఖ్యముగా అంటువ్యాధులు బాలింతరాండ్రకు సులభముగా సోకును గాన, యెవరువచ్చినచో వారిద్వారా అంటువ్యాధులు సోకునో, అట్టివారిని పురిటిగదిలోని కెంతమాత్రమును రానీయగూడదు.

ప్రసవమైన పిమ్మట ఆరుగంటలలోగా బాలింతరాలు మూత్రమును విడువవలెను. ఒక ప్రక్కకు వంగకుండనే మూత్రవిసర్జనము చేయుట మంచిది. లేదా, అనగా, ఆమె అటుల మూత్రమును వదలజాలనిచో బొర్లగిలపడి మోకాళ్లమీదను, చేతులమీదను ఆనుకొని మూత్రమును వదలవలెను. అప్పటికిని మూత్రము సరిగా పోనిచో వైద్యులను పిలువవలెను. ఈలోగా పొత్తికడుపు దిగువభాగము పైనను, గుహ్యాంగము పైనను వేడినీళ్లతో కాపటము పెట్టవలెను.



ప్రసవమైనపిమ్మట సరిగా విరేచనమగుచుండుట చాలముఖ్యము. మరునాడు సాయంత్రమునగాని, మూడవనాడుదయమున గాని విరేచనము కాకపోయినచో, ఒక టేబిలుస్పూను ఆముదమును త్రాగించవలెను. లేదా వెచ్చనినీళ్లలో సబ్బుకలిపి యెనీమా చెయ్యవలెను.

ఆహారము:—బాలింతరాలు మంచి ఆరోగ్యవతిగా నున్నచో చనుబాల జ్వరము తగ్గిపోవువరకును పాలు, టోస్టు, బార్లీ పాలు కలిపిన పలచని జావ, లేక ఆరోరూటు పాలు కలసిన పలచని జావ, అంబలి (గూరయెలు) మున్నగువానిని మాత్రమే పుచ్చుకొనుచుండవలెను. అటుపిమ్మట బాలింతరాలి అభిప్రాయానుసారము ఆహారమును యేర్పాటు చేయవచ్చును. మూడురోజులు వెళ్ళిన పిమ్మట మరే జబ్బును లేనిచో, మజ్జిగ అన్నము, చారు అన్నము, పాలు అన్నము, మంచి మాంసము లేక కోడిపిల్ల మాంసముతో చేయబడిన పులుసు మున్నగు వానిని తినవచ్చును. మూడు రోజులు గడచిన పిమ్మట గూడ కరకర ఆకలి వేయనిచో, వైద్యులను పిలువవలెను. ఏదో లోపమున్నదని గ్రహింప వలెను.

ప్రసవమైన పిమ్మట ఒక అరగంటకు సాధారణముగా లోకియా' లేక క్లీన్సింగ్సు అనబడు నొక విధమగు కల్మష స్రావము

కలుగును. దానితో పాటు కొద్దిగా నొప్పులు (ఆఫ్టరు-పెయిన్సు) గూడ నుండును. అపుడు రక్తస్రావ మధికమగును. ఆహారము తినుట, మూత్ర విసర్జనము మున్నగు పనులకు లేచినపుడెల్ల నల్లని రక్తపు గెడ్డలు పడిపోవుచుండును. ఈ నొప్పులు మితముగా నున్నచో, చాల మంచిదే. అవిరక్త స్రావమును నిరోధించును. గర్భాశయములోని మలినమును వెడల నడచును. అది ముడుచు కొనునట్లు గూడ చేయును. తరుచుగా శిశువుకు పాలిచ్చుచుండుట వలన గూడ యీ నొప్పులు అధికమగుచుండును. ఈ నొప్పులు సామాన్యముగా నున్నచో యే మందును అవసరము లేదు. మిక్కిలి హెచ్చుగా నున్న యడల మాత్రము వైద్యుని పిలువవలెను. మొదట నీ రక్తము యెర్రగానే రక్తపు ముద్దలతో కలసి యుండును గాని క్రమముగా నది చాల పలచబడి పసరురంగుతో కలిసిన పసుపు రంగుగా మారును. చివరకు మురికి నీళ్లవలెనగును. ఆనీళ్లకొకవిధమగు వాసనగూడ నుండును. ఆ నీటి పరిమితియును, కాల పరిమితియును, బాలింతరాండ్ర ప్రకృతిని బట్టి అనేక విధములుగా నుండును. కొందరికి మావిపడిపోగానే యీ నొప్పులు తగ్గిపోవును. మరికొందరికి నెల రోజుల వరకును గూడ తగ్గవు. బాలింతరాలు నీరసస్థితిలో నుండినచో యీ నొప్పులు చాల కాలముండును గాన, అధికమగు జాగ్రత్త పుచ్చుకొన వలసి యుండును.



అట్టిచో విధిగా డాక్టరును పిలువవలెను. లేనిచో ఆవల చాల చిక్కులు కలుగ గలవు.

సాధారణముగా ప్రసవమైన పిమ్మట 12 గంటల వరకును బాలింతరాలి పాలిండ్లు మామూలుగానే యుండును. గాని వానిలో నొప్పి కలుగును. అవి పెరుగసాగును. వానిలో నుండు పాలకు బిగువు చాల అధికమగును. అందువలన స్తనముల భారముగూడ నధికమగును. రక్తము పాల క్రింద మారుటకు పాలిండ్లలోనికి యెంత వడిగా ప్రవహించుచుండునో, యీ మార్పుగూడ అంత అధిక ముగనే కలుగుచుండును. కొంత మందికి వణుకు కలుగును. కొందరికి కొద్దిగా జ్వరము గూడ తగులవచ్చును. పాలు స్రవింప నారంభింపగానే యివన్నియును తగ్గిపోవును. వణుకు పుట్టినచో వైద్యుని పిలువవలెను. ఈలోగా విరేచనమగుట కొక మోతాదు యియ్య దగును. స్తనముల మీద కాపటము పెట్టదగును. బాలింతరాలికి రక్తస్రావము కలుగుటయును, దానిని నివారించుటకును గర్భాశయము ముడుచుకొనునట్లు చేయుటకును, పైని సూచింపబడిన రీతిని శిశువును తల్లి ప్రక్కలో పరుండబెట్టి తల్లిరొమ్మును శిశువునోటిలో పెట్టుటయును జరిగినయడల తప్ప లేనిచో ప్రసవమైనపిమ్మట ఆరుగంటలగువరకును శిశువునోట తల్లి స్తనాగ్రమును పెట్టి

గూడదు. ఒకటి రెండు కాన్పులైన వారికి త్వరలోనే పాలు విస్తారముగా మారును. కొంతమంది శిశువులు, పుట్టిన వెంటనే నిద్ర పోక పోరు పెట్టెదరు. అట్లు పోరు పెట్టినను, పాలు విస్తారముగా వెంటనే యూరినను ఆరు గంటలగు వరకును ఆగ నక్కరలేదు. వెంటనే శిశువునకు స్తన్యము నియ్యదగును. చను మొనలు మిక్కిలి పొట్టిగానున్నను సరిగా నేర్పడక పోయినను చనులు మిక్కిలి హెచ్చుగా పెరుగుటచే చను మొనలు శిశువు నోటి కందకుండ నున్నను చనుగొట్టము (బ్రెస్టు పంపు) తో చను మొనలను పైకి లాగవలెను. చనుగొట్టము లభింపనపుడు సోడా బుడ్డిని తెచ్చి అడుగు బిళ్లను మాత్రము జాగ్రతగా తీసివేసి సోడా బుడ్డి మూతిని అనగా సన్నగానుండు భాగమును చను మొనకు తగిలించి సోడా బుడ్డి అడుగు భాగమును నోట బెట్టుకొని పీల్చినచో చనుబాలు ఆ బుడ్డి గుండా నోటిలోనికి వచ్చును. మొదట వచ్చు ధారలు నీళ్ల వలెనేయుండును గాని వానిలో పసుపురంగుగా ధారములవలె సన్నగా నుండును. ఈ మొదటి ధారలు శిశువు త్రాగినచో శిశువునకు విరేచనమగును. విరేచనము చేయించు శక్తి కోలోస్ట్రిము అనబడు యీ మొదటి ధారలకు కలదు. 24 గంటలైన పిమ్మట చనుబాలు తెల్లగా మారును. వానికి తీపి కలుగును. అవి చిక్క బడును (ఒపేకు).



శిశువుకు పాలియ్యబోవునపుడును, శిశువు పాలు త్రాగినపిమ్మటను మెత్తని గుడ్డను నీళ్లలో ముంచి ఆ గుడ్డతో చనుమొనలను శుభ్రముగా తుడుచుచుండవలెను. చనుబాలు ఒక్క చుక్కయైన చనుమొనల కంటుకొని అచట యెండిపోయినచో అచట దురద, మంట, పుండు మున్నగునవి కలుగును. శిశువు మరల చనుగుడుచునపుడు ఆయెండిన పాలు శిశువు కడుపులోనికి పోయి చాల బాధ కలిగించును గాన, శిశువు పాలు త్రాగిన వెంటనే మెత్తని తడిగుడ్డతో స్తనములను, స్తనాగ్రములను బాగుగా తుడువవలెను. మరల పాలియ్య బోవునపుడు గూడ నిటులే చేయుచుండవలెను. ప్రతి దినమును ఉదయముననూ, సాయంతనమును, స్తనములకును, స్తనాగ్రములకును సబ్బురాచి వేడినీళ్లతో కడుగుచుండవలెను. ఈ రీతిగా శ్రద్ధగా చేయుచున్నచో చనుల యొద్ద పుండ్లు, యితర బాధలు మున్నగున వేవియును కలుగవు. మొదటి వారమున బాలింతరాలు పరుండియే చనుగుడుపుచుండవలెను. ఆమె ఒక ప్రక్కకు వత్తిగిలి మోచేతిమీద నానుకొని చనుమొనను శిశువు నోట పెట్టవలెను. అటు పిమ్మట జేర్లబడి కూర్చుండి శిశువుకు పాలియ్యవలెను. రెండు చను మొనలను మార్చి మార్చి శిశువు నోట పెట్టుచుండవలెను.

12 వ రోజువరకును తల్లి పరుండియే యుండవలెను. పిమ్మట పడక కుర్చీలోగాని కవాచీ మంచములోగాని జేర్లబడి కూర్చుండ వచ్చును. పరుపుమీద ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు బాలింతరాలిని త్రిప్ప వచ్చును. లేదా ఒక మంచముమీదనుండి మరియొకమంచము మీదికి ఆమె నుమార్చవచ్చును. ప్రక్కను దులిపి వేయుటకు గూడ బాలింతరాలిని లేవదీసి కూర్చుండ బెట్టగూడదు. అందులో రక్తస్రావము విస్తారముగా నున్నచో అసలే కదలింపగూడదు. గర్భాశయము మరల మామూలు స్థితికి వచ్చుటకు కొంతకాలము పట్టును. త్వరగా అనగా 12 రోజులలో పలనే ప్రక్క మీదనుండి లేచినచో దాని ఫలితముగా, నీరసము, నొప్పులు, విరామము లేని రక్తస్రావము మున్నగునవి కలుగును. తొందర పడి యింటి పనులు చేయుట, భోగముల ననుభవించుట మున్నగు పనులను బాలింతరాలు చేసినచో గర్భాశయము యెల్లప్పుడును వాచియుండుట, లేక స్థానమునుండి తొలగుట మున్నగు అనర్థములు కలుగుటకు దారి యేర్పడును. ప్రక్క మీదనుండి లేచినందు వలన రక్తస్రావము కలిగినచో పొరబాటును గ్రహించి మరల వెంటనే పరుండవలెను. ప్రసవ వేదన ప్రారంభమైనది మొదలుకొని పురిటి గదిలోనికి గాలి బాగుగా వచ్చుచుండునట్లు మంచి యేర్పాటులను చేయవలెను. భారతీయులలో చాలమంది యీ విషయమున నేమియును



శ్రద్ధ పుచ్చుకొనరు. సాధారణముగా చాలమంది, గాలి రాపిలులేని గదులనే ప్రసవమునకు యేర్పాటుచేసి నెల పురుడు వెళ్లు వరకును బాలింతరాలిని, శిశువును, గాలి రాపిలులేని ఆ చీకటి గదిలోనే యుంచెదరు. గాలి తగిలినచో బాలింతరాలికిని, శిశువుకును జలుబు చేయునని వారు దురభిప్రాయపడుచుందురు. ఇది మిక్కిలి పొరబాటు. బాలింతరాలికిని, శిశువుకును గూడ మంచి గాలి ముఖ్యావసరమైయున్నది.



# తొమ్మిదవ ప్రకరణము.

## అసహజ ప్రసవ వేదన.

నొప్పు లారంభమైన 24 గంటలలో శిశువు జనించిన యెడలను, అపుడు, మొదటు, శిశువు తలయే బయటకు వచ్చిన యడలను అది సహజ మగు కానుపగును. దీనికి భిన్నములగున వన్నియును అసహజములే.

### (౧) చాలసేపు నొప్పులుపడుట.

మిక్కిలి హెచ్చు కాలము వరకును గర్భవతి నొప్పులు పడుచున్నను బిడ్డ పుట్టకపోవుట నిరపాయకరము కాదు, గాన నది దీర్ఘ కాలపు కానుపని మా అభిప్రాయము. ప్రసవములో గల అపాయ లక్షణము క్రీ దిగువ వివరింపబడెను. గాన, వానిని గమనించి వెంటనే వైద్య సహాయమును బడయవలెను.

(అ) నాడివడి 70-80 మధ్యగా నుండినచో అది సహజము. నాడివడి 100 గాని నూటికి పైగాగాని యున్న యడలను, చాలసేపటి వరకును శిశువు కలుగని యడలను వెంటనే వైద్యుని పిలువనంపవలెను.



(ఆ) ఒక నొప్పికిని, రెండవ నొప్పికిని మధ్య విరామము లేక పోయినను. నొప్పి వచ్చినపుడు బాధ భరింపనలవి గాకుండ నుండినను, కొంతసేపు నొప్పులు వచ్చి తరువాత పూర్తిగా నిలచిపోయినను (సాధారణముగా నీటితిత్తి పగిలినపిమ్మట నటులనాగి పోవును) వెంటనే వైద్యుని పిలువవలెను.

(ఇ) గర్భవతి మొగమున ఆందోళనము కనబడు చుండినను, ఆమె నాలుకపై తడిలేక పోయినను, నాలుకపై పాచి యేర్పడినను వెంటనే డాక్టరును పిలువవలెను.





శిశువులు జనించు ముఖ్యరీతులైదిచట చూప బడినవి.

1. పుర్రె (వెర్టాక్సు)
2, మొగము.
3. వస్తికము (పెల్విసు).
4. అడ్డము (ట్రాన్సువెర్సు).
5. కనుబొమ.

## (౨) బొడ్డు నరము బిడ్డ మెడకు చుట్టుకొనుట.

12 మందిలో నొకరి కిటుల జరుగు చుండును. బొడ్డునరము బిడ్డమెడకు తగులు కొనినపుడది చాల పొడుగుగానే యుండును గాన సాధారణముగా నిది ప్రమాదకరము కాదు. అపుడు దానిని మెల్లగా లాగి వదులు చేయవలెను. ఆ సందులలో శిశువు భుజములను దూర్చ వలెను. నరము పెద్దదిగానున్నచో దానిని శిశువు తలమీద నుండి తీసివేయ వలెను. కొంతమందికి నరము చాల బిగువుగానుండును. అపు డది శిశువు మెడకు బిగుసుకొని పోయినచో ఊపిరాడక శిశువుమరణించును గాన నపుడు నరమును త్రెంపవలసి యుండును. అపుడు దానిని కత్తితో కోసినచో రక్తమధికముగా స్రవించును గాన కత్తితో కోయగూడదు. చేతి వ్రేలి గోరుతోనే త్రెంపవలెను.

## (3) పిరుదులు ముందు వచ్చుట

అరువది మందిలో నొకరికిట్టి కానుపుకలుగును. అపుడు శిశువు పిరుదులయొద్ద మడతపడును గాన, శిశువుకు విశాలమగు స్థలము కావలసి వచ్చును. అందువలన చాలసేపటి వరకును ప్రసవము జరుగదు. ఇటుల జరిగినచో మరల శిశువు తలను క్రిందకు త్రిప్పుట చాల కష్టము



గాన, వెంటనే వైద్యుని పిలువవలెను. ఈ లోగా గర్భవతి పరుండియే యుండవలెను. నీటి తిత్తి పగులువరకును చూలింతరాలు ముక్క గూడదు. వైద్యులు సమీపమున లేని యెడల, శిశువు, బొడ్డువరకు వెలు పలికిరాగానే బొడ్డునరములో నొకమడతను లాగి దానిని వస్తికము నందొక ప్రక్కకు మరలించ వలెను. అచటనది తలమీద విశేషముగ నొక్కుట కవకాశము తక్కువగానుండును. పిమ్మట బొటనవ్రేలిని మరి యొక వ్రేలిని ఆ నరముమీద నుంచవలెను. గాని దానిలోని ధ్వని చేతికి తగులుచున్నంత సేపును యేమియును చేయగూడదు. భుజములు వెలుపలకు వచ్చువరకును వేచియుండవలెను. చాలమంది కపుడు మరియొక నొప్పితోనే శిశువు పూర్తిగా క్రిందపడును. లేదా చాల వరకైన వెలుపలకు వచ్చును. బొడ్డు నరము ధ్వని తగులు చున్నంత వరకును శిశువు భుజములు వెలుపలికి వచ్చిననే గాని శిశువును లాగ గూడదు. ఇది చాల ముఖ్యవిషయము. అటుల లాగినచో శిశువు చేతులు తలపైని తగులుకొనును. అపుడు శిశువు జనించుట మరింత కష్టమగును. బొడ్డునరము ధ్వని చేతికి తగులకుండ నిలచిపోయి నపుడు మాత్రము వెంటనే శిశువును పైకి లాగివేయవలెను. లేనిచో శిశువు లోపలనే చనిపోవును.

## (౮) చేతులు ముందువచ్చుట (క్రానుబర్తు)

230 మందిలో నెవరికో యొకరి కిట్టి కానుపు కలుగును.



దీనినే అడ్డకాను పందురు. ఒకచేయి ముందుగా వెలుపలికి వచ్చుటయని గూడ దీనినందురు,

ఇటుల జరిగినచో వైద్య సహాయము ముఖ్యముగా నుండవలెను. లేనిచో శిశువు పుట్టనేరదు. డాక్టరు వచ్చువరకును శిశువుతల యేతట్టున తగులుచుండునో, ఆ తట్టుగా గర్భవతి పరుండియుండవలెను. శిశువు తలను సరిగా త్రిప్పుటకు డాక్టరు శస్త్ర చికిత్సను (ఆపరేషను) చేయవలసిన అవసరము గూడ కొందరికి కలుగవచ్చును,

## (౯) కవల పిల్లలు.

70 మందిలో నొకరికి కవల పిల్లలు పుట్టెదరు. కొంతమందికి శిశువు తలయును, మరికొందరికి శిశువు కాలును వెలికి వచ్చును. సాధా



రణముగా కవల పిల్లల ప్రసవము సహజముగానే జరుగుచుండును. మొదట నొక శిశువు జనించునుగాని కొందరికి వెంటనే దాని మావి పడిపోదు. రెండవ శిశువుగూడ పుట్టిన పిమ్మటనే మావి పడును. కొందరికి మొదటి శిశువు పుట్టినవెంటనే మావి పడిపోవుటయును కలదు. గర్భాశయ పరిమాణము కొద్దిగా తగ్గుటవలన రెండవ శిశువులోన నున్నదని గ్రహింపవచ్చును. ఒక వేళ మొదటి శిశువు పుట్టగానే మావి పడనిచో దానిని తీయుటకు ప్రయత్నింపగూడదు. ఏలననగా యిద్దరు శిశువులు కలిగినను కొందరికి మావి



కవల పిల్లలు (గలాబిను)

యొక్కటియే పడునుగాని రెండు పడవు. కవల పిల్లలున్నారను అనుమానము కలిగినచో డాక్టరుకు వెంటనే తెలియజేయవలెను. మొదటి శిశువు కలిగిన పిమ్మట డాక్టరు వచ్చులోగా గర్భాశయము ముడుచుకొని పోవుటకు ప్రయత్నింప వలెను. పేగుల అడుగుభాగమును అయిదు వ్రేళ్లతోను గట్టిగా పట్టుకొన వలెను. కొందరికి మొదటి

శిశువు కలిగిన పది నిముషములలోనే రెండవ శిశువు కలుగును. మరి కొందరికి కొన్నిగంటల వరకును కూడ కలుగదు. అపుడు మరల నొప్పులు కలుగువరకును బాలింతరాలు పరుండియే యుండవలెను. రక్తము స్రవింపకుండ చూచుకొనుచుండ వలెను. మొదటిశిశువు కలుగునపుడే అవయవములన్నియును విడిపోవును గాన రెండవ శిశువు కలుగుట కంత కష్టముండదు. మొదటి శిశువు కలుగగానే బొడ్డునరమును, రెండుచోట్ల ముడివేయవలెను గాని, మావిని మాత్రము తీసివేయ గూడదు. రెండవ శిశువు కలిగిన పిమ్మటను, మావి పడి పోయిన తరువాతను గర్భాశయము ముడుచుకొనుటకు తగిన జాగ్రత్త పుచ్చుకొన వలెను. గర్భాశయము గట్టిగానుండు బంతివలె స్థిరముగా చేతికి తగులు వరకును చేతితో గర్భాశయము నదుమవలెను. దానిపైని కట్టుకట్టవలెను.

## (౬) శిశువు కాలు ముందు వచ్చుట.

కొందరికి శిశువు కాళ్లలో ఒకటిగాని, రెండునుగాని ముందుగా యీవలకు వచ్చును. ఇది 100 మందిలో నొకరికి మాత్రమే జరుగుచుండును. ఈ కానుపు వలన తల్లికి నిరపాయమే. గాని శిశువుకు నిరపాయము కాదు. ఒత్తిడి వలన బొడ్డు నరమునందలి రక్త చలన మాగి



పోవుట కవకాశము కలదు. వెంటనే వైద్య సహాయ మత్యవసరము. అంతవరకును బాలింతరాలేమియును చేయగూడదు. నొప్పులు వచ్చుచునే యుండవలెను. కాళ్ళు ముందు వచ్చిన యడల పిరుదులను నిలిపియుంచ వలెను. పిరుదులనెంత సేపు నిలుప గలిగిన నంత మంచిది. అందువలన నా భాగములంత విశాల మగును. అపుడు తల వెలుపలికి వచ్చుట చాల సులువగును. పిరుదు లీవలికి రాగానే నాభి నరమును పరీక్షించి చూడవలెను, దాని చలన మాగిపోయినచో మరియొక నొప్పితో శిశువు క్రింద బడునట్లు తొందరగా ప్రయత్నము చేయవలెను. మరల నొప్పి రాగానే పిల్లను నిదానముగ క్రిందికి లాగవలెను. తల యీవలకు వచ్చిన పిమ్మట గూడ నాభినరము కొట్టుకొనుచునేయున్న ఎడల పిల్ల యేడ్చు వరకును దానిని విడదీయగూడదు. నాభినరములో రక్త చలన మున్న యడల చనిపోయిన బిడ్డ ప్రసవమునకు తెలుపబడిన పద్ధతినే అవలంబింప వలెను.



కాలు ముందు వచ్చుట.

## (౭) ముఖము ముందు వచ్చుట.

230 మందిలో నొకరికి శిశువు ముఖము మొదట వెలుపలకు వచ్చును. శిశువు తల పైభాగము మొదట వెలుపలకు వచ్చుటకు మారుగా కొందరికి శిశువు ముఖము వెలుపలకు వచ్చును. ఇటుల జరిగినచో చాల సేపు కష్టపడిన గాని శిశువు కలుగదు. ఇట్టి కానుపులో శిశువు తలయును, మొగమును వాచి వక్రతను జెందును గాని, సాధారణముగా శిశువుకు ప్రాణాపాయము కలుగదు. వెంటనే వైద్యుని పిలువవలెను. డాక్టరు వచ్చువరకును గర్భవతి మొదటి నొప్పుల కాలములో లేచి నడువగూడదు. విధిగా పరుండియే యుండవలెను. నీటి తిత్తి త్వరగా పగులకుండుటకు శక్తి వంచన లేకుండ ప్రయత్నించుచుండవలెను. వైద్యులు సమీపమునందు లేనిచో సహజముగా ప్రసవము జరుగు వరకును మిన్నక చూచుచుండుటయే కర్తవ్యము. అదియే ఉత్తమ పద్ధతి.

## (౮) నొసలు ముందుగా వెలుపలికి వచ్చుట.

శిశువు నొసలు మొదట వెలుపలికి వచ్చినచో శిశువు సహజముగా పుట్టజాలదు గాన, వీలైనచో శిశువును సరియైన రీతికి త్రిప్పుటకు



ప్రయత్నింపవలెను. లేనిచో శిశువుకు ప్రాణాపాయము కలుగ వచ్చును. వెంటనే వైద్యుని పిలువనంపవలెను గాని మరేమియును చేయగూడదు.



## పదవ ప్రకరణము.

## ప్రసవ సమయమున పరిశుభ్రత.

గర్భవతి ఆరోగ్యవతిగా నున్నచో నొప్పులు ఆరంభించగానే యోని మార్గమునందు ద్రవ మధికముగా నూరును. గర్భాశయద్వార మునందలి గోళములలోనూరిన ద్రవము కొంతయును, యోనియందలి రక్త నాళములనుండి వెడలిన పలచని ద్రవము కొంతయును యోని ద్వారమునందు కలియును. ఈ ద్రవమునందు రక్షక క్రిములు విస్తారముగా నుండును గాన, హానికరములగు వ్యాధులను కలిగించు క్రిములు గర్భాశయమునందు ప్రవేశింపకుండ నీ రక్షక క్రిములు వాని నిరోధించుచుండును. ఈ రక్షక క్రిములు ఆమ్ల క్షీర రసమును (లాక్టికుయాసిడు) ను గూడ కలిగించును. ఈ రసము యోని లోని ద్రవమును పసరు (యాసిడు) గా మార్చును. ప్రసవమైన పిమ్మట జ్వరమును కలిగించునట్టి క్రిములు యీ యాసిడులో పెరుగ జాలవు గాన, నవి భగ ద్రవమునందు జనింప జాలవు. యోనిలో ప్రాణవాయువు (ఆక్సిజను) లేదు గాన రక్షక క్రిముల, క్రిమి సంహారక శక్తి మరింత అధికమగు చున్నది. రోగములను కలిగించు ననేక రకములగు క్రిము



లకు యోనిలో ప్రవేశ పెట్టినను నవి కొన్ని గంటలలోనే చనిపోవు నని గూడ పరిశోధనల వలన స్పష్టమైనది. యోనియందు సహజమగు నిట్టి రక్షణ యుండుటయే గాక గర్భాశయ ద్వారమునందంతటను జిగటు (మ్యూకసు) తో నిండి బిరడావలె బిగిసి యుండుట వలనగూడ విష క్రిములు లోనికి పోజాలవు.

శిశువు జనింపగానే లోపలనుండు ఉల్లి పొరవంటి చర్మపు గోడ (మెంబ్రేన్సు) లన్నియును పగిలిపోవును గాన బిడ్డ చుట్టునుండు సంచిలోని నీరు లిక్కరు ఆమ్నీ అను యోనిలోనికి వచ్చును. అపుడచటనుండి రక్షక క్రిములన్నియును వెడలి పోవును. ప్రసవ సమయమున గర్భాశయము చాల ప్రమాదములకు గురియైయుండును గాన అట్టి అపాయ స్థితిలో విషక్రిములు దానిలో ప్రవేసింపకుండ చేయుటకు ప్రకృతి యీ యేర్పాటుల నన్నిటిని చేసియున్నది. యోని పరీక్షను, యోనిలో శస్త్రి చికిత్సను చేయవలసి వచ్చినపుడు సహజమగు నీ రక్షణ చాలదు గాన, హాని కరములగు క్రిములు గర్భాశయమున ప్రవేశింపకుండుటకు మనము శక్తి వంచన లేకుండ రక్షణ నేర్పాటు చేయవలసియుండును. వైద్యుల చేతులు మురికిగానుండినను, శస్త్రోపకరణములు మురికిగా నుండినను మరియొక స్త్రీకి శస్త్ర చికిత్స చేసినపుడు

యోనియందలి విషద్రవ్యము వైద్యుని చేతులకు గాని, ఉపకరణములకు గాని అంటుకొని యుండినను వ్యాధిని కలిగించు విషక్రిములా రీతిగా గర్భవతి యోనియందు ప్రవేశించుట కవకాశము కలదు.

అందు వలన వైద్యులు చేతులను శుభ్రముగా కడుగుకొనవలెను. గోళ్లలో తరుచుగా మురికి చేరును. మురికిలో విషక్రిములుండును. గాన గోళ్లను తీయించుచుండవలెను. చేతులను మంచి కార్బాలికు సబ్బుతో కడుగవలెను. కుంచెతో గోళ్లను శుభ్ర పరచవలెను. పిమ్మట సబ్బంత యును పోవునట్లు నీళ్లతో చేతులను బాగుగా కడుగవలెను. అనంతరము నీళ్లలో పుటము వేయబడినట్టియు, క్షయింపజేయునట్టి స్వభావము కలిగినట్టియు (క్రోసివు సబ్లిమేటు) పదార్థమును 500 కు 1 వంతున కలిపి చేతులను 1-2 నిముషముల వరకును ఆ నీళ్లలో ముంచి యుంచవలెను. ఏ విధమైన చమురును వాడగూడదు. ఆముదమును బొత్తిగా వాడగూడదు. కార్బోలిషుడు వాసిలైనుగూడ హానికరమే. శస్త్రము చేయవలసిన అవసరము కలిగినచో ఉపకరణములను అయిదు నిముషములకు తక్కువ కాకుండా నీళ్లలో వేసి మరగించవలెను. యోనియును, దాని చుట్టునుండు చర్మమును వంగకుండుటకు 1000 కి 1 వంతున గల కరోసివు లోషనుతో గాని, ఒక పైంటు నీటిలో 1 టీ స్పూను



వంతున గల లిసలు లోషనుతో గాని (వేడి నీళ్లు—చల్లని నీళ్లు) యోనిని, దాని చుట్టునుండు చర్మమును కడుగవలెను. ప్రసవమునకు ముందును, ప్రసవమైన పిమ్మటను యోని మార్గమునందు పిచికారీ (డౌచింగు) చేయు పద్ధతి యిపుడు మానివేయబడెను. ఈ రీతిగా తగిన యేర్పాటు లన్నియును చేసినచో ప్రసవమైన పిమ్మట సూతికా జ్వరము (సెప్టికు ఫీవరు) బాలింతరాలికి తగులుటకు వీలుండదు. మంత్రసాని తనకు నందధిక ప్రజ్ఞగల వారైనను సూతికా జ్వరము రాకుండుటకు తగిన యేర్పాటులను చేయనిచో బాలింతరాండ్ర ప్రాణములను కాపాడ జాలరు. ఈ జ్వరము రాకుండుటకు పైని వివరించిన యేర్పాటులను చేసినచో బాలింతరాండ్లలో మరణములు చాల తక్కువ యగును.

## ప్రసవమునందు ఉద్భృతములు.

### (౧) రక్తస్రావము.

శిశువు పుట్టకముందును, పుట్టిన పిమ్మటను, శిశువు పుట్టిన పిమ్మట మావి పడకముందునుగూడ బాలింతరాలికి రక్తస్రావము కలుగవచ్చును. శిశువు పుట్టకముందే కలిగినచో, మావి గర్భాశయద్వారము మీద పడు

టయే సాధారణముగా రక్తస్రావమునకు కారణమగును. అటుల పడినచో గర్భాశయము విస్తరించినపుడు మావిలోని నాళములు పగిలిపోవును. ఈ రీతియగు రక్తస్రావము గర్భవతికి ఆరు నెలలు నిండిన పిమ్మట నెప్పుడైనను కలుగవచ్చును కాని సాధారణముగా 8-9 నెలల మధ్య చాల మందికి కలుగుచుండును. అటుల కలిగినచో చూలింతరాలు కదలగూడదు. ఆమెను పరుండబెట్టి వైద్యుని పిలువవలెను. ఈ లోగా చూలింతరాలికి టీ, కాఫీ, సారా మున్నగు ఉద్రేక కరములగు వాని నియ్యగూడదు. గుహ్యాంగము పైని తడిగుడ్డ పట్టీలను వేయవలెను. ఆహారమును చాల కొద్దిగా నియ్యవలెను.

ప్రసవమైన వెంటనే గాని మావిపడిన పిమ్మట గాని, కొన్ని గంటలైన పిమ్మటను గాని రక్తస్రావము కలుగవచ్చును, కొన్ని రోజులైన పిమ్మట గూడ కొందరికి కలుగును. ప్రసవము కాగానే రక్తస్రావము కలిగినచో గర్భాశయము బాగుగా ముడుచు కొనక పోవుటయే కారణమగును. మావి పడిపోయిన పిమ్మట సామాన్యముగా నందరికిని గూడ కొంత రక్తస్రావము కలుగును. అది 8-10 అవున్సులకంటె హెచ్చుగా నుండదు. అంతకంటె అధికముగా రక్తము పోయినచో బాలింతరాలికి స్మృతి తప్పిపోవును. పాలిపోవును. ఊపిరి గూడ సరిగా



అందదు. అపుడు గర్భాశయము మెత్తగానుండును. అది ముడుచు కొనునట్లు చేయుటకు పేగుల అడుగు భాగమున చాల గట్టిగా నొక్కవలెను. గర్భాశయము పైని చెయివేసి చర్మము గుండ దానిపైని చేతితో రాయవలెను. చేతితో దానిని గట్టిగా పట్టు కొనవలెను. మిక్కిలి చల్లగానుండు నీళ్లలోగాని, మంచుగడ్డవేసిన నీళ్లలోగాని, చిన్న తువాలు ముంచి ఆ భాగములపైని వేయవలెను. చల్లని నీళ్లను గాని మంచుగడ్డ వేసిన నీళ్లను గాని త్రాగించవలెను. శిశువు నోట తల్లి పాలిండ్లను పెట్టవలెను. ఉద్రేక కరములగు పానీయములను త్రాగగూడదు. బాలింతరాలిని లేవదీసి కూర్చుండ బెట్ట గూడదు.

శిశువు పుట్టిన పిమ్మటను, మావి పడకముందును రక్తస్రావము కలిగినచో గర్భాశయము పైని నొక్కుట వలన గాని, యోనిలోనుండి గర్భాశయము లోనికి చేతిని పోనిచ్చి గాని వ్రేళ్లతో మావిని చీల్చి తీసివేయవలెను. అనగా డాక్టరును పిలచి డాక్టరుచేత నిటుల మావిని తీయించవలెను గాని యితరులు తీయగూడదు. డాక్టరు లేనిచో మరియొకరు చేతిని పొడిగుడ్డతో తుడుచుకొని దానికి టించరు ఆఫ్ అయోడినును రాయవలెను. లేనిచో రక్తము విష మిశ్రితమై అపాయము కలుగగలదు.

ప్రసవమైన పిమ్మట కొన్ని గంటలో, కొన్ని రోజులో గడచిన యనంతరము రక్తస్రావము కలిగినచో అది అనేక కారణముల వలన కలుగును. మావిలో కొంత భాగము నిలువయుండుట, రక్తపు ముద్ద అడ్డుపడుట వలన గర్భాశయము పూర్తిగా ముడుచుకొనక పోవుట, గర్భాశయము విడిపోవుట, భయము, ఉద్రేకము మున్నగు కారణములలో దేనివలననైనను రక్తస్రావము కలుగును. అపుడు బాలింతరాలు పరుండియే యుండవలెను. గర్భాశయము, యోని మున్నగు నవయవములపైని దళసరి గుడ్డను చన్నీళ్లలో తడిపి కప్పవలెను. డాక్టరును పిలువనంపవలెను. రక్తస్రావము కలిగిన వారికి ఎర్గాటు లిక్విడు ఎక్స్ట్రాక్టును ఒక మోతాదుకు ఒక డ్రాము వంతున నియ్యవలెను. ఇదియే దీనికి మిక్కిలి మంచి మందు.

ఈ సాధనము లేవియును పనిచేయనిచో హృదయమునకుత్సాహము కలిగించుటకు, బ్రాందీ, విస్కీ మున్నగు సారాయీలను గాని బలమైన కాఫీనిగాని, టీని గాని యియ్యవలెను. తల క్రింద దిండ్లను తీసివేయ వలెను. కాళ్ల వైపున మంచపు కోళ్లక్రింద యిటుకలను పెట్టి కాళ్ల వైపున మంచమును కొంచెము పైకి లేపవలెను. రక్తము, లోపలి అవయవములలోనికి పోవుట అవసరము గాన, అటుల



పోవుటకుగాను కాళ్లకును, చేతులకును పట్టెదలను (బాండేజను) కట్టవలెను. పీలైన ఎనిమానియ్యవలెను. రెండు పైంటులు వెచ్చని నీళ్లలో రెండు స్పూనులు ఉప్పు కలిపి, పిల్లపేగుల (లోవరు బవెల్సు) లోనికి యెనిమా చేసి ఆ నీరు అచటనే యుండునట్లు చూడవలెను.

## (౨) ఈడ్పులు.

ప్రసవము కాక ముందుగాని, ప్రసవ సమయమునగాని, ప్రసవమైన పిమ్మట గాని యీడ్పులు మున్నగునవి కలిగినచో వెంటనే వైద్యుని పిలువవలెను. అంత వరకును ఆ స్త్రీ ఈడ్పులలో దొరలి క్రిందపడకుండుటకు గాను క్రిందనే పరుండ బెట్టవలెను. కాళ్లను చేతులను నేలపై వేసి కొట్టుకొని గాయములను తగిలించుకొనక చూచుచుండవలెను. ఆమె కట్టుకొనిన బట్టలనన్నిటిని వదులు చేయవలెను. మంచి చల్లని గాలి తగులు చోట పరుండ బెట్టవలెను. ముఖము పైని చల్లని నీళ్లు చల్లవలెను. నాలుక కొరుకుకొన కుండుటకు పళ్ల సందున మడత బెట్టిన గుడ్డలైనను, మెత్తని కఱ్ఱ ముక్కయైనను కఱ్ఱ బిరడా నైనను పెట్టవలెను. తల వేడిగా నున్నచో, చల్లని నీళ్లను గాని, మంచు గడ్డను గాని తలపైని పెట్టవలెను. ఆమె మ్రింగ గలిగి

యున్నచో విరేచన మగుటకు కొంచెము ఆముదమును త్రాగించవలెను. శేదా వెచ్చని నీళ్లతో యెనిమా చేయవలెను. చెమట పట్టుటకు వేడి వేడి పానీయమును త్రాగించవలెను. వేడి తగ్గకుండుటకు బ్లాంకెట్లను కప్ప వలెను.

## (౩) బొడ్డు నరము పడిపోవుట.

ప్రమాదము వలన బొడ్డు నరము (కార్డు) జారిపోయినచో అది వస్తికకును, శిశువు శరీరమునకును మధ్య పడి నలిగి పోవును. అటుల జరిగినచో శిశువు చనిపోవును. కావున వెంటనే డాక్టరును పిలువ వలెను. లోపలి పొరలు (మెంబ్రేన్సు) పగలకుండ నున్నచో గర్భవతి మోకాళ్ల మీదను, మోచేతుల మీదను ఆనుకొని వంగి కూర్చుండవలెను. పొరలు పగిలిపోయినచో రెండు మూడు వ్రేళ్లను లోనికి పోనిచ్చి బొడ్డు నరమును పైకి త్రోయుటకు ప్రయత్నింప వలెను. మరల నొప్పి వచ్చు వరకును దాని నచటనే యుంచవలెను.

## (౪) గర్భాశయము పగులుట.

ఈ ప్రమాదము సాధారణముగా కలుగదు గాని, ఇది మిక్కిలి అపాయకరమైనది. గర్భాశయము పగిలినచో యీ దిగువ వివరింపబడిన



లక్షణములు కలుగును. ఆకస్మికముగా భరింపరాని బాధ కలుగును. ఏదో జారి పడిపోవుచున్నట్లు తోచును. ద్వారమున కనబడిన శిశువు మరల లోనికి పోవును. ఆ ద్వారమున పేగుల చుట్టలు కనబడును. రక్త మధికముగా పోవుచుండును, చలిగానుండును, చెమట పట్టును, నాడి బలహీనమగును. ఊపిరి త్వరగాను, కొద్దిగాను వెడలుచుండును. వెంటనే డాక్టరును పిలువవలెను. ఇది చాల అపాయకరమైనది గాన గర్భవతికి ప్రాణాపాయము కలుగకుండుటకు వేడి వేడి కాఫీ మున్నగు నుత్తేజకముల నిచ్చుచుండవలెను. ఒక గుడ్డను, పరిశుద్ధి నొందింపబడిన (స్టెరిలైజుడు) వెచ్చనినీళ్లలో ముంచి దానిని పేగుల చుట్టలపైని కప్పవలెను.

## ౫. యోనిమార్గ ద్వారము (పెరినియం) పగులుట

శిశువు తల యీ మార్గద్వారముగుండ పోవుచున్నపుడీ ద్వారమును బాగుగా నొక్కి పట్టియుంచినచో నిట్టి ప్రమాదము లెన్నడును కలుగవు. తొలికాన్పు నందెంత జాగ్రత్తగా నున్ననుగూడ చాలమందికి యీద్వారముకొద్దిగా పగులుచునే యుండును. అటులపగిలినచో డాక్టరు దానిని వెంటనే కుట్టివేయవలెను. డాక్టరు వచ్చువరకును ఆభాగమును (1-100) లిసలు ద్రావకముతో తడుపు చుండవలెను. లోనుండి వచ్చు

మురికి ద్రవములవలన నది మలినము కాకుండ దానిని కాపాడవలెను. గర్భవతిని పరుండబెట్టి రెండుకాళ్లను కలిపి కట్టివేయవలెను,

### ౬. గర్భాశయము వెలుపలికి వచ్చుట.

గర్భాశయము వెలుపలికి వచ్చినచో రక్తము స్రవించును, గట్టిపడిన మాంసపు ముద్ద ద్వారమున కనబడును. కడుపు దిగువ భాగమునందు ముద్దగాకనబడు చుండవలసిన గర్భాశయముయొక్క పైభాగమచట కనబడదు. గర్భాశయము పగిలి నపుడు కలుగురీతినే, చలియును, చెమటయును, కలుగును. ఇదికూడ చాలప్రమాదకరమే కావున, వెంటనే డాక్టరును పిలువవలెను. ఈలోగా వ్రేళ్లను ముడిచి రక్తముతోకూడ ద్వారమున కనబడుచున్న ముద్దను గట్టిగాలోనికి త్రోయవలెను. దానివలన నది లోనికి పోనిచో టీ, కాఫీమున్నగునుత్తేజకములను త్రాగించుచుండవలెను. శిశువు, కలిగినపిమ్మట మావిత్వరగా పడిపోవుటకు గాను బొడ్డునరమును (కార్డు) లాగిన యెడలనే యీ కడపటి ఉపద్రవము సాధారణముగా కలుగుచుండును.



## పదునొకండవ ప్రకరణము.

### ప్రసవానంతరము పెద్దపురుడులో కలుగు చిక్కులు.

౧. రక్తస్రావము:—శిశువు జనించిన పిమ్మట పదిరోజుల లోగా రక్తస్రావము కలిగినచో వెంటనే వైద్యుని పిలువనంప వలెను. అతడు వచ్చువరకును పదియవ ప్రకరణములో ప్రసవము నందు ఉదృతములను శీర్షిక క్రింద తెలుపబడిన సాధనములను చేయుచుండ వలెను.

౨. పెద్దపురుడులో ప్రసూతిక జ్వరము:—ఇది చాల అపాయకరమైనది. శిశువు పుట్టినపిమ్మట కొందరికి యీ జ్వరము వచ్చుచుండును. ప్రసవమునకు ముందైనను, ప్రసవసమయము నందైనను, ప్రసవానంతరము నందైనను స్త్రీలకు రహస్యాంత రావయవ మార్గముల ద్వారా, మురికి లోన చేరుటవలననే యీ జ్వరము వచ్చును. ఈ జ్వరము వచ్చినచో ప్రసవమైన పిమ్మట త్వరలోనే వణుకుపుట్టును. వెంటనే జ్వరము తగులును, నాడి చాల వడిగా కొట్టుకొనును. స్తన్య మిగిరిపోవును. యోనిగుండ స్రవించుద్రవము పూర్తిగా నిలచిపోవును. లేదా తక్కువ యగును. చాల మందికి ఆ స్రవమునకు చాల దుర్వాసన గూడ

కలుగును. కడుపు ఉబ్బి మెత్తబడును. కొందరికి వాంతులు, విదాహము, చెమట మున్నగునవి గూడ కలుగును. ఈలక్షణము లేవైన కలిగినచో యెంతమాత్రమును ఆలస్యము చేయకుండ వైద్యుని పిలిపింపవలెను. విరేచనము సరిగా కాక పోయినచో డాక్టరువచ్చులోగా ఎనీమానియ్యవలెను. లేదా ఆముదమును త్రాగించవలెను. కానిచో మెగ్నీషియం సల్ఫేటును గాని, సోడియం సల్ఫేటును గాని ఒక టేబిలుస్పూను యియ్యవలెను. రెండు పైంటులు వెచ్చని నీళ్ళలో రెండు టీ స్పూనులు లిసలు ద్రావకమును కలిపి యోనిలో పిచికార చేయువలెను. లిన్సీడు పిండిని పుడికించి వెచ్చగా కడుపుమీద వేయవలెను. గదిలోనికి గాలి బాగుగా వచ్చుచుండ వలెను.

౩. తెల్లకాలు (వైటులెగు):—కొందరికి ఒకకాలును, కొందరికి రెండు కాళ్లును వాచును. నొప్పిగూడ కలుగును. తొడ అడుగుభాగము నుండి పాదము వరకునుగూడ వాపు కలుగును. ప్రసవమైన మొదటి వారము మొదలు, అయిదవ వారములోగా నిది వచ్చును. మొదట వణుకు, జ్వరము, దాహము, వికారము, నాడి తీవ్రమగుట, నాలుకపై పాచి, నడుమునొప్పి మున్నగునవి కలుగును. రక్తనాళములలో రక్తము పేరు కొనుటయే దీనికి కారణము. వాచినభాగము చేతికి వేడిగాను,



మెత్తగాను, పాలిపోయియు యుండును. ఆభాగము నిగనిగ లాడు చుండును. ఆ భాగమును కదలించుటకే వీలుండదు. అపుడు వైద్యునికి తెలియజేయవలెను. కదలనీయ గూడదు. ఆ భాగముపైని దూదితోను, ఫ్లానలుతోను కట్టు (బాండేజి) కట్టవలెను. వేడినీళ్లతో తరుచుగా కాచుచుండవలెను. అవసరమైనచో కొద్దిగా విరేచన సాధనముగూడ చేయవలెను.

పరా:—అపుడు బాలింతరాలి కాళ్లను ముట్టుకొనగూడదు. ముట్టుకొనినను, పట్టినను, నలిపినను ఆ రక్తపుగడ్డ పగులును. అందువలన బాలింతరాలికి ప్రాణాపాయము గూడ కలుగవచ్చును.

౪. పెద్దపురుడులో పిచ్చియెత్తుట:—శిశువు జనించిన వెంటనే కొందరికిని, శిశువుకు పాలిచ్చుట మానినపుడు కొందరికిని, పిచ్చియెత్తుట కూడ కలదు. శిశువుకు అతివిస్తారముగా పాలిచ్చుట (ఓవరు నర్సింగు) వలననే ముఖ్యముగా నిటుల పిచ్చిపట్టును. మొదట కొందరికి కొద్దిగా జ్వరమువచ్చును. కొందరికి యీడ్పులు వచ్చును, కొందరికి సూతికా జ్వరమువచ్చును. పిమ్మట బాలింతరాండ్రకు నవ్వుట, పాడుట, అసభ్యముగ మాటలాడుట మున్నగు లక్షణములుగూడ కలుగును. కొందరు

తమశిశువులను చంపుటకు గూడ ప్రయత్నించెదరు. అపుడు వెంటనే వైద్యుని పిలువవలెను. ఈ లక్షణములు కనబడగానే శిశువును తల్లి ప్రక్కలో నుండి తీసివేసి వేరొక చోటనుంచి పోతపాలుపోసి పెంచవలెను.

# పన్నెండవ ప్రకరణము.

## శిశు సంరక్షణము.

శిశువు పుట్టగానే శిశువునోటిలో జిగట, నురుగు మున్నగునవేవైన నున్నచో వానిని తీసివేయవలెను. పిమ్మట శిశువు యేడ్చినచో (శిశువు సజీవమై పుట్టినయడల అనగా కడుపులోనే చనిపోయి పుట్టనియడల విధిగా యేడ్చును) నాభినాళమును ముడివేసి కోసివేయవలెను. ఆ నాళమునకుగట్టిగా రెండు చోట్ల కట్టుకట్టవలెను. శిశువునాభి పైని 2½ అంగుళముల దూరమున ఒక కట్టును, 3 అంగుళములకు పైగా రెండవ కట్టును కట్టవలెను. ఈ రెండు కట్లకును మధ్యగా మొద్దుబారిన కత్తెరతో కత్తిరించవలెను. శిశువు పుట్టుమన్నపుడు శిశువును పట్టుకొనుటకు ఒక వెచ్చని దుప్పటి (బ్లాంకెటు) గాని, ఫ్లానలు గుడ్డ గాని సిద్ధముగా నుండవలెను. లేనిచో శిశువు క్రింద పడినయడల దెబ్బ తగులును. శిశువు జనించినపుడు శిశువు మెడ వెనుక భాగము ఒక చేతి బొట్టన వ్రేలికిని రెండవ వ్రేలికిని మధ్యగా నుండునట్లు పట్టుకొనవలెను. శిశువు తొడలను రెండవ చేతితో పట్టుకొనవలెను. బోరకు

యాసిడులో వేసి దూదిని నీళ్లలో ముంచి దానితో శిశువు కనులను జాగ్రత్తగా కడుగవలెను.

97 డిగ్రీల ఎఫ్ ఉష్ణము గల వేడి నీళ్లను సిద్ధపరిచి శిశువు శరీరము నా నీళ్లలో ముంచవలెను. థెర్మామిటరు లేనిచో మోచేతినా నీళ్లలో ముంచుటవలన నీళ్లు సరియైన పాళములో నున్నదియు లేనిదియు బాగుగా తెలియును. అటుల ముంచి శిశువు వంటి నంటుకొనియున్న జిడ్డునంతను శుభ్రము చేయవలెను. చంకలు, గజ్జలు, కనుబొమలు మున్నగు స్థలములలో జిడ్డు పట్టుకొనియుండును. వినోలియాగ్లిసరైన మున్నగు మెత్తని సబ్బులతో రుద్ది తువాలుతో గాని, స్పంజితో గాని శిశువు వళ్లు తుడువవలెను. ఇది చాల శుభ్రముగాను, మెత్తగాను యుండవలెను. మూడు నాలుగు నిముషములకంటె హెచ్చుగా శిశువును నీళ్లలో నుంచగూడదు. జిడ్డు పూర్తిగా వదలక పోయిననుగూడ తీసి వేయవలెను. జిడ్డు యేమైన మిగిలియున్నచో తరువాత చేయించు స్నానములలో పూర్తిగా వదలిపోవును. తొట్టిలో స్నానము చేయించునపుడు తొట్టిలో నీళ్లు కొద్దిగా పోసి శిశువును తొట్టిలోనే తల నీటిపై నుండునట్లు పరుండ బెట్టవలెను. గాని ఒక చేతితో పట్టుకొనియుంచగూడదు. ఏల ననగా శిశువుల యెముకలు చాల మెత్తగానుం



డును గాన శరీరము యొక్క బరువును సహింప జాలవు. ఈ రీతిగా స్నానము చేయించిన పిమ్మట తేలికగా తుడిచి శిశువు నొక మెత్తని పెక్కా (పిల్లో) పైని పరుండబెట్టి పలచని ఫ్లానలు గుడ్డను కప్పవలెను.

నాభి నాళము:—తరువాత నాభి నాళమునకు చికిత్స చేయవలెను. నాళమునకు కట్టబడిన కట్టును ముడివద్ద కోసి వేయవలెను. ముడి తొలిగినదా, సరిగా నున్నదా, రక్తము స్రవించుచున్నదా, అని పరీక్షించి, ముడి తొలిగినను, రక్తము స్రవించుచున్నను మరియొక కట్టు కట్టవలెను. నాళము నటుల కోసిన పిమ్మట ఆ కొనపైని బోరికు యాసిడును చల్లి బోరికు దూది ముక్కను దాని పైనివేసి కట్టుకట్టవలెను. ఈ కట్టు బిగువుగా నుండగూడదు. ఈ రీతిగా 5, 6 రోజుల వరకును ప్రతిదినమును నాళమునకు చికిత్స చేయుచుండవలెను. అప్పుడీ నాళము వూడిపోవును. దాని దిగువను చిన్నగాయము మాత్రముండును. అది త్వరగానే మానిపోవును. నాళ మటుల త్వరగా విడిపోకున్నను తొందరపడి దానిని లాగ గూడదు. క్రమముగా అదియే ఊడిపోవును.

క్రొత్తగా పుట్టిన శిశువుకు మందు:—శిశువు పుట్టిన వెంటనే యేదో యొకమందు వేయవలెనని చాలమంది అభిప్రాయ పడుచున్నా

రు. క్రొత్తగా పుట్టిన శిశువుకు మందు యెంత మాత్రమును అవసరము లేదు గాన, నిది చాల పొరబాటు అభిప్రాయము. ఆ శిశువుకు మందు వేయుట వలన మరింత హానియే కలుగును గాని మేలుకలుగదు. శిశువు పుట్టిన వెంటనే కొంతసేపు నిద్రపోవుట సహజము. శిశువు కనులకు వెలుతురు తగులకుండ యేర్పాటు చేయవలెను. శిశువు శరీరమునకు చలిగాలి తగులగూడదు. శిశువు తనంతట లేచి యేడ్చువరకును లేప గూడదు. శిశువుకు పాలు పోయనిచో శోషవచ్చునను దురభిప్రాయమున కొందరు శిశువుకు నిద్రాభంగము కలిగించెదరు. 5, 6 గంటల సేపు నిద్రపోయిన పిమ్మట శిశువుకు మెలకువ వచ్చును. అపుడు శిశువు యేడ్చును. అపుడు శిశువుకు స్తన్యము నియ్యవలెను. అపుడు బాలింతరాలు రొమ్మును శిశువునోట పెట్టవలెను. అందు వలన ఆమెకు పాలు ఊరును. గర్భాశయము ముడుచుకొనును. మొదట బాలింతరాలి రొమ్ములలోనుండి వచ్చు ధారలలో శిశువుకు విరేచనమును కలిగించు శక్తిని ప్రకృతి నెల కొలిపి యున్నది. కావున శిశువులకు ఆముదము మున్నగు వాని నియ్యకుండ యీ పాల ధారలను ముఖ్యముగా త్రాగ నియ్యవలెను. ఆ రీతిగా తొలి ధారలు శిశువుకు లభించుట కవకాశము కలుగనపుడును, నెలలు పూర్తి గాకుండ ప్రసవ మగుట వలన తల్లికి పాలు



ఊరనపుడును, ఈ తొలిధారల వలన శిశువుకు విరేచనము కానపుడును మాత్రమే ఒక టీ స్పూను ఆముదమును శిశువుకు త్రాగింపవచ్చును. శిశువు పుట్టిన పిమ్మట కొన్ని గంటలగు సరికి మొదటి విరేచనమగును. అది పసుపు రంగుగా నుండును. దానిని మెకోనియం అందురు. సాధారణముగా శిశువులు తొలిసారి మూత్రము వదలునపుడే విరేచనముగూడ నగును. తొలిధారలను త్రాగుట వలననే చాలమంది శిశువులకీ మెకోనియం వెడలిపోవును. ఇది శిశువు కడుపులో నిలువయుండినచో అజీర్తి విరేచనములు కలుగును. గాన దీని నెటులనైన వెడలింపవలెను. మూడవ మాటు విరేచనము పసుపు రంగుగా నుండక నల్లగా నున్నచో ఒకటీ స్పూను ఆముదమును త్రాగింపదగును.

క్రొత్తగా పుట్టిన శిశువులకు ఆహారము:—శిశువు పుట్టిన వెంటనే పాలిచ్చు ఆచారము మంచిది గాదు. పుట్టిన పిమ్మట 10, 12 గంటల వరకును శిశువెట్టి ఆహారమును కోరదు. శిశువుకు తల్లి చనుపాలే చాలును. పలిచూలు మొదలు బాలింతలకు ప్రసవమైన వెంటనే గూడ బాగుగా పాలూరును. గాన శిశువు పుట్టిన 12 గంటలలోనే వారు పాలియ్య గలుగుదురు. అటుల తల్లికి శిశువు కలిగిన వెంటనే పాలు ఊరనిచో అనగా పాలు ఊరుట కొంత ఆలస్యమైనచో ఆవు

పాలను, నీళ్లను, తియ్యగానుండుటకు కొద్దిగా చక్కెరను కలిపి మూడు గంటల కొకసారి శిశువుకు పోయుచుండవలెను. తల్లికి పాలు ఊరినది మొదలు శిశువు తల్లిపాలనే త్రాగుచుండవలెను. శిశువుకు తల్లిపాలిచ్చునపుడు, రొమ్మును వ్రేళ్లతో నొక్కి పట్టుకొని చనుమొనను శిశువు నోట పెట్టవలెను. మొదటి పదిరోజులలోను శిశువు నిద్ర లేచినపుడు మాత్రమే పాలిచ్చుచుండవలెను. అటుపిమ్మట 20 రోజుల వరకును పగటిపూట రెండు గంటల కొకసారియును, రాత్రి మూడు గంటల కొకసారియును పాలిచ్చుచుండవలెను. నెల రోజులైన పిమ్మట క్రమముగా నాలుగు గంటల కొకసారి పాలిచ్చు పద్ధతి నవలంబింపవలెను. రాత్రి 10 గంటల మొదలు ఉదయము 5 గంటల వరకును పాలియ్యగూడదు. క్రమముగా యీ పద్ధతిని గూడ అవలంబింపదగును. అందువలన తల్లికి నిద్రాభంగము కలుగకుండ నుండును. శిశువు ఏడ్చినపుడెల్ల ఆకలియగుట వలననే యేడ్చుచున్నదని తలపగూడదు. దాహము వేయుట వలనగూడ శిశువు లేడ్చెదరు. నీళ్లను మరిగించి చల్లారబోసి, ఒక టీ స్పూను నీళ్లు శిశువుకు పోసినచో శిశువు యేడ్పు మానును, శిశువుకు ఒకసారి ఒక రొమ్ము నోట బెట్టినచో మరియొకసారి వేరొక రొమ్మును నోట బెట్టవలెను. ఈ రీతిగా రొమ్ములను మార్చి మార్చి పాలిచ్చు చుండవలెను.



బట్టలు:—శిశువుల బట్టలు తేలికగాను, వదులుగాను వెచ్చగాను యుండవలెను.

వెచ్చదనము:—శిశువుకు వెచ్చదనము కలుగుటకు శిశువును మొదట తల్లి ప్రక్కలోనే పరుండ బెట్టవలెను. కాని దిండ్లను విస్తారముగా పెట్టగూడదు. మూడు వారములైన పిమ్మట శిశువును వేరొక ప్రక్కమీదనే పరుండ బెట్టవలెను.



## పదుమూడవ ప్రకరణము.

## శిశువులు పుట్టినపిమ్మట వారికి కలుగునట్టి వ్యాధులు

శిశువు పుట్టినపిమ్మట తలి దండ్రులకు ఆందోళనమును కలిగించునట్టి పరిస్థితుల నేకము కలుగుట కవకాశము కలదు.

(౧) మృత శిశువు పుట్టుట:—శిశువు పుట్టినపుడు కదలిక లేకుండను, యేడ్వకుండను ప్రాణరహితమగు శిశువువలె కనబడినచో వెంటనే డాక్టరును పిలువవలెను. శుభ్రమైన గుడ్డను వ్రేలికిచుట్టుకొని ఆ వ్రేలిని శిశువు నోటిలోనికి పోనిచ్చి గొంతుకలో ద్రవముగాని, జిగటుగాని అడ్డుపడియున్నచో దానిని తీసివేయవలెను. నాభీనాళమునకు బొడ్డుకు పైభాగమున మూడంగుళముల దూరమున నొకకట్టు గట్టిగా కట్టవలెను. క్రిందిభాగమున ఒకటి రెండంగుళముల దూరములో మరియొక కట్టుకట్టవలెను. గాని పైదానిని బిగించినట్లు క్రిందిదానిని గట్టిగా బిగించ గూడదు. ఈ రెండు కట్లకుమధ్య భాగమున నాళమును విభజించవలెను. ఒక టీ స్పూను రక్తము వెలికివచ్చు వరకును క్రింది భాగమునందలి కట్టును బిగించగూడదు. ఇటుల చేయగానే అదివరకు శవ ప్రాయులుగా నున్న శిశువులకు కొందరికి ఊపిరాడును, వారు



యేడ్చుటగూడ జరుగును. ఇటులచేసినను శిశువుయేడువకున్నచో చన్నీళ్లను వేడినీళ్లను మార్చిమార్చి శిశువు పైని చిలకరించు చుండవలెను. దీని వలనగూడ లాభము కలుగనిచో నోటిని శుభ్రపరచిన పిమ్మట తడిగుడ్డను మడిచి దాని కోణముతో మొగము మీదను, తుంట్లమీదను కొట్టవలెను. ఒక పక్షి యీకెను ముక్కులలోను నోటిలోను పెట్టి త్రిప్పవలెను. ఇవన్నియునుగూడ విఫలమైనచో డాక్టరు వచ్చి ఊపిరిని కలిగించుటకు స్వయముగా ప్రయత్నించి చూడవలెను. అతడటుల చేయుచుండగా శిశువుకు స్నానము చేయించుటకు వేడి నీళ్లను సిద్ధపరచవలెను. బొడ్డునాళమును కోసి కట్టుకట్టిన పిమ్మట శిశువును వేడినీళ్లలో పరుండబెట్ట వలెను. కొందరు శిశువులు పుట్టిన పిమ్మట రెండుగంటల వరకును గూడ మృతప్రాయులుగా నుండుటయు అవల ఊపిరి వచ్చి యేడ్చుటయును గూడ జరుగుచుండును.



(మార్షలుహాలుగారి పద్ధతి ప్రకారము కృత్రిమ సాధనములవలన ఊపిరాడునట్లు చేయుట)

(౨) కళ్లంటుకొనుట:—శిశువు నిద్రపోయి లేచినపుడు కను రెప్ప లంటుకొని పోవును, కనుకొలుకులు యెఱ్ఱబడును, వెలుతురులో కనులు మూతపడును, కను రెప్పలు వాచును, కనులలో నుండి నీరు కారును. అపరిశుభ్రత వలనను, తల్లి గుహ్యేంద్రియముల నుండి వెడలునట్టి మురికి నీరు శిశువు కనులకు సోకుట వలనను, పుట్టిన వెంటనే తొలిసారి నీళ్లుపోయునపుడు సబ్బుతో రుద్దుటలో సబ్బునీళ్లు శిశువు కనులలోనికి పోవుటవలనను గూడ నిట్టి కంటి జబ్బులు కలుగును. శిశువును చాల పరిశుభ్రముగా నుంచవలెను. బోరికు దూదిని వేడి నీళ్లలో ముంచి దానితో తరుచుగా కనులను కడుగుచుండ వలెను. కను రెప్ప లంటుకొనకుండ వాసలైనును రెప్పలకు రాయుచుండ వలెను శిశువుల కండ్లజబ్బుల కిదియే చికిత్స.



మార్షలుహాలుగారి పద్ధతిప్రకారము కృత్రిమ సాధనములవలన ఊపి రాడునట్లు చేయుట (ఇనిస్పిరేషను).



(౩) మూత్రము వెడలక పోవుట:—కొందరు శిశువులు పుట్టిన పిమ్మట 24 గంటల వరకునుగూడ మూత్రమును వదలరు. అట్టి శిశువులు కాళ్లను ముడుచుకొని బాధవలన యేడ్చు చుందురు. అట్టిచో వెంటనే డాక్టరును పిలువనంప వలెను. శిశువుకు వెచ్చని నీళ్లుపోసి స్నానము చేయించవలెను. లేదా పేగుల క్రిందిభాగమున కాచవలెను. అటుల చేసినచో మూత్రము వెడలును.

(౪) పచ్చ కామెరలు:—ఈ వ్యాధి వచ్చినచో శిశువు కళ్ళు పసుపు రంగుగానుండును. కంటిలోని తెల్లగ్రుడ్డుకు గూడ పసుపురంగు కలుగును. మూత్రము నల్లగానుండును. గాని మూత్రము బట్టమీద పడినచో నచట పసుపు రంగమర కలుగును. విరేచనము తెల్లగానగును. కాలేయము (లివరు) సరిగా పనిచేయక పోవుటయే దీనికిముఖ్యకారణము. డాక్టరును పిలువనంప వలెనుగాని వెంటనే ఒక టీస్పూను అముదమును శిశువుకు పెట్టవలెను.

(౫) బొడ్డులో పుండగుట:—కొంతమంది శిశువులకు బొడ్డులో పుండగును. ఆ బాధవలన యేడ్పులు గూడ వచ్చును. ఆ పుండు మీద బోరికు యాసిడును వేసి దానిపైని బోరికు దూదిని వుంచి కట్టు కట్టవలెను.

(౬) ఈడ్పులు:—ఈడ్పు వచ్చినపుడు కనులకును, మొగమునకును సంబంధించిన కండరములు ముడిబడును, శరీరము బిఱ్ఱ బిగియును, చేతులు బిగుసుకొని పోవును, నోటిలోనుండి కొద్దిగా చొంగవచ్చును, మొగమునకు నీలి రంగు (బ్లూ) వచ్చును. ఊపిరినిలచి పోవును. వెంటనే డాక్టరును పిలువనంప వలెనుగాని, శిశువును తక్షణమే వెచ్చని నీళ్లతొట్టెలో పరుండబెట్టి దానిలో అయిదు నిమిషములుంచ వలెను. శిశువుతలకు చలవచేయు వస్తువులను కట్టవలెను.



# పదునాల్గవ ప్రకరణము.

## శిశువుల కాహారము.

శిశువులను పోషించుట యందును, శిశువుల కాహారము నిచ్చుట యందును అతిసులభములగు ఆరోగ్య నియమములను సైతము తలిదండ్రులు సరిగా తెలుసుకొనక పోవుటవలననే శిశువులలో చాలమంది ముఖ్యముగా యేడాది లోపుననే చనిపోవు చున్నారు. అందుకొరకు కొన్నిసూచన లిచట చేయబడినవి. బిడ్డల తల్లులు వీనిని గమనింపదగును.

శిశువుల కాహారము నిచ్చుటలో రెండు విధములున్నవి:—

1. శిశువునకు తల్లి చనుగుడుపుట. 2. పోతపాలను పోయుట. క్రొత్తగా పుట్టిన శిశువు జీర్ణకోశమునకు తల్లి స్తన్యమును జీర్ణముచేసుకొనగలశక్తి మాత్రమే యుండునుగాన శిశువుకు తల్లిచను బాలే మిక్కిలి శ్రేష్ఠమైనవి. పోతపాలు త్రాగిన బిడ్డలకు సోకునంత హెచ్చుగాను తీవ్రముగను వ్యాధులు చనుబాలు త్రాగిన బిడ్డలకు సోకవు. కావున సాధ్యమగు నంతవరకు తనశిశువుకు తల్లియే చనుగుడుప వలెను.

తల్లికి జబ్బుచేసినను లేక తల్లి చనిపోయినను యొకపాల దాయీని నియమింపవలెను. పాలదాయి సంపూర్ణారోగ్య వతిగాను, బలముగలదిగాను యుండవలెను గాని చాలలావు పారినదిగా నుండ గూడదు ఆమెకు క్షయ, సవాయిమున్నగు నంటువ్యాధులేవియు నుండ గూడదు. ఆమెకు 20-30యేండ్ల మధ్యవయనుండవలెను. ఆమె శిశువును యీ శిశువును సమ వయస్కులుగా నుండవలెను. ఆమె కోపస్వ భావము కలదిగా నుండగూడదు. శాంత స్వభావముకలదిగా నుండవలెను. ఆమెకు తరుచుగా కోపమువచ్చు చుండునెడల, ఆమె పాలను త్రాగుట వలన శిశువుకుకడుపునొప్పి అజీర్తి ఈడ్పులు మున్నగు వ్యాధులేగాక ప్రబల వ్యాధులు గూడ కలుగవచ్చును. గాన నట్టి స్త్రీలచే శిశువులకు పాలిప్పించ గూడదు.

శిశువు జనించిన పిమ్మట రెండుగంటలు మొదలు నాలుగు గంటలలోగా తల్లి శిశువుకు చనుగుడుపవలెను. మొదటు పంచదార నీళ్లను చనుముక్కులకు రాయవలెను. శిశువు జనించిన పిమ్మట రెండురోజుల వరకును అన్నము, గంజి, జావ, మున్నగున జీర్ణకరములగు నాహారములను వేనిని పెట్టగూడదు. అదిచాల అపాయకరము ఒకరోజుకు 24 గంటలలోను 4 మొదలు 6 సారులవరకును శిశువుకు



తల్లి చనుగుడుపు చుండవచ్చును. పగటిపూట. మొదటి అయిదువార ములును తప్పక రెండు గంటల కొకసారి తల్లి చనుగుడుప వలెను. ఆరవవారము మొదలు 12 వ వారము వరకును 2½ గంటల కొకసారి స్తన్యము నియ్యవలెను. మూడవ నెల మొదలు తొమ్మిదన నెల వరకును మూడు గంటలకొకసారి స్తన్యము నియ్యవలెను. తొమ్మిదవ నెల మొదలు పన్నెండవ నెలవరకును 3½ గంటల కొకసారి పాలిచ్చు చుండవలెను. రాత్రిపూట మొదటి వారమున ఒకటి రెండు సారులు మాత్రమే పాలియ్యవలెను. అటుపిమ్మట అయిదవనెల వరకును రాత్రి 10 గంటలవు డొక్కసార మాత్రమే పాలియ్య వలెను. ఆయిదవ నెల వచ్చినపిమ్మట రాత్రి 10 గంటలు మొదలు ఉదయము 6 గంటల వరకును శిశువుకు పాలియ్యనే గూడదు.

ఈరీతిగా వేళ ప్రకారము శిశువులకు పాలిచ్చుట చాల ముఖ్యమైనది. శిశువు యేడ్చినపుడెల్ల పాలియ్యగూడదు. అందువలన అజీర్ణము, కడుపునొప్పి, విరేచనములు మున్నగునవి కలుగును. వేళ ప్రకారము పాలిచ్చు చున్నపుడు మధ్య శిశువు యేడ్చినచో శిశువునకు దాహమైనదని గ్రహింపవలెను. అపుడు వెచ్చని నీళ్లను కొద్దిగా త్రాగిం

చినచో శిశువు పరుండును. ఎపుడును గూడ తడవకు 15 నిముషముల కంటె హెచ్చుగా పాలియ్యగూడదు.

తల్లి పాలియ్య లేనపుడును, పాలిచ్చుటకు మరే స్త్రీయును లభింపనపుడును యితర జంతువుల పాలనే శిశువులకు పోయవలెను. ఏ జంతువు పాలును మనుష్య స్త్రీ పాలవలె నుండవు. జంతువుల పాలలో ఆవు పాలే సులభముగా లభించును. ఆవు పాలను అటులే శిశువులకు పోసినచో వారికవి జీర్ణమునకు రావు. మనుష్య స్త్రీ పాల లోను, ఆవు పాలలోను వస్తు సంపుటిలో భేదమున్నది. రెండిటిలోను కొవ్వు సమానముగానే యుండును. గాని ఆవు పాలలో మాంసకృత్తులు హెచ్చుగాను (100-కి 3½) చక్కెర తక్కువగాను (100-కి 4½) యుండును. కడుపులోనికి పోయినపిమ్మట స్త్రీలపాలు క్షారముగాను, ఆవు పాలు పసరుగాను పరిణమించును. స్త్రీల పాలయందలి మాంస కృత్తుల యందుండు జున్ను (కేసిను) కంటె ఆవుపాలలోని మాంస కృత్తులయందు జున్ను హెచ్చుగానుండును. అందువలన మనుష్య స్త్రీల పాలు త్రాగుటవలన కడుపులో నవి పేరుకొనినను చాల పలచగాను, చిన్న చిన్న బిళ్లలుగాను పేరుకొనును. ఆవుపాలు చాల దళము గాను పెద్దపెద్ద బిళ్లలుగాను పేరుకొనును. గాన స్త్రీలపాలు అరుగు



నంత శీఘ్రముగ ఆవుపాలు అరుగవు. కావున ఆవు పాలలో మంచి నీళ్లనుగాని, బార్లీబియ్యపు నీళ్లను గాని సమభాగములుగా (అళాకు పాలకు అళాకు నీళ్ళు) చేర్చి శిశువులకు పోయవలెను. అటుల పోసి నచో మాంసకృత్తులు 3½ నుండి 1½ కు తగ్గును. అపుడు ఆవు పాలును స్త్రీల పాల వలెనేయుండును. ఇటుల పాలలో నీరు కలుపుట వలన మాంసకృత్తులు తగ్గును గాని వానితోపాటు యితర ద్రవ్యము లన్నియును గూడ తగ్గును. కొవ్వుతగ్గిపోవును గాన మీగడను చేర్చ వలెను. మీగడలో100-కి 16-20 పాళ్ళు కొవ్వుండును. చక్కెర తగ్గిపోవును గాన, పాలచక్కెర (మిల్కుషుగరు) ను చేర్చవలెను. పాలచక్కెరపాలలో సహజమైనది. చెరకుచక్కెర, యితర చక్కెరలు మున్నగు వానికంటె పాల చక్కెరయే శిశువులకు బాగుగా సరిపడును. ఆవు పాలు పసరుగా మారకుండ క్షారముగా మారుటకు సున్నపు నీళ్ల (లైమువాటరు) ను గాని సోడా బైకార్బొనేటును గాని చేర్చవలెను.

శిశువు జనించిన పిమ్మట 15 రోజుల వరకును పాలను నీళ్లను కలుపుటలో 1-3 గా, అనగా ఒక అళాకు పాలకు మూడు అళాకులు నీళ్ల వంతునను, అటుపిమ్మట మూడవ నెల వచ్చువరకును 1-2 వంతు

నను, మూడవ నెల మొదలు ఆరవ నెల వరకును 1-1 వంతునను 6 వ నెల మొదలు 9వ నెల వరకును, 2-1వంతునను మిశ్రమము చేయుచుండవలెను. మొదటి నెలలో ఒక తడవకు 1-1½ అవున్సుల పాలును, రెండవ నెలలో 2-3 అవున్సులును, మూడవ నెలలో 3-4 అవున్సులును, నాల్గయిదు నెలలలో 4-5 అవున్సులును, ఆరవ నెలలో 5, 6 అవున్సులును, ఏడవ నెల మొదలు తొమ్మిదవ నెల వరకును 6-7 అవున్సులును, తొమ్మిదవ నెల మొదలు పన్నెండవ నెల వరకును 8-9 అవున్సులును పోయుచుండవలెను. మరిగించని పాలను అనగా పచ్చిపాలను త్రాగించిననే శిశువుల కధికమగు పుష్టి కలుగును గాని చెన్నపురిపాలను మరిగించకుండ యెన్నడును పోయగూడదు. ఏల ననగా వానిలో క్రిములుండును. అందువలన అజీర్ణ సంబంధములగు వ్యాధులు గలుగును.

ఇపుడు అనేక విధములగు డబ్బాపాలు విక్రయింప బడుచున్నవి. ఇవి స్త్రీల పాలకంటెను గూడ శ్రేష్ఠమనివారు చెప్పకున్నను స్త్రీల పాలతో సమానమగు గుణముగల వని మాత్రము ఘంటాపథముగా ఘోషించుచున్నారు. ఈ డబ్బా పాలలో యేవి మంచివని నిర్ణయించుటలో మన మీ విషయములను గమనింపవలెను. తొమ్మిది నెలలలోపు శిశువులకు గంజి గల ఆహారములను వేనిని గూడ నియ్య



గూడదు. కావున గంజి పదార్థములన్నియును పూర్తిగా క్రొవ్వు పదార్థములుగా మారినట్టి డబ్బాపాలనే ఆరు నెలల లోపు శిశువులకు పోయవలెను. హార్లిక్సు మాల్టెడు మిల్కును, ఎల్లెను బరీఫుడ్సు 1,2 నంబరులును, మెలిన్సు ఫుడును శ్రేష్ఠమైనవి గాన వీనినే యిట్టి శిశువులకు పోయదగును.

పాలబుడ్లను రబ్బరు మొనలను గూడ చాల శుభ్రముగా నుంచవలెను. పాలబుడ్లు సరిగా నుండక పోయినను, రబ్బరు మొనలు మురికిగా నుండినను పాలను సరిగా కాచక పోయిననుగూడ శిశువులకు చాల జబ్బు చేయును. బుడ్డి పడవ ఆకారముగా నుండవలెను. కోణములు, గుంటలు, వంకరలు మున్నగునవి యుండ గూడదు.



బుడ్డిని కొళాయి క్రింద నుంచి బాగుగా కడుగుటకు వీలుగా నుండవలెను. శిశువు బుడ్డిలోని పాల నన్నిటిని త్రాగిన వెంటనే బుడ్డిని తీసివేసి అడుగున మిగిలిన పాలను పారబోసి దానిలో నీళ్లు

పోసి బాగుగా గులకరించి కడిగి దానిని సోడా ద్రావకములో ముంచవలెను. నీళ్లలో వాషింగు సోడా గుండను హెచ్చుగా కలిపి దానిలో యీ బుడ్డిని ముంచి యుంచవలెను.

ఇటుల శిశువు పాలు త్రాగిన వెంటనే రబ్బరు మొనలను గూడ లోపలను, వెలుపలను శుభ్రమైన నీటిలో బాగుగా కడుగవలెను. రబ్బరు మొనలకు పాలు తగిలినచో పాలలోని కొవ్వు రబ్బరును తిని వేయును గాన మొనలు త్వరగా పగిలిపోవును. చన్నీళ్లలో ఒక చిటికెడు సోడా బైకార్బొనేటును కలిపి యీ మొనల నా నీళ్లలోముంచి యుంచుట మిక్కిలి మంచిది.



పాల బుడ్డిని తల క్రిందుగా వంచినచో బుడ్డిలోని పాలు సులభముగా బొట్లు బొట్లుగా కారుచుండవలెను గాన రబ్బరు మొనరంధ్ర మందుకుతగినంత పెద్దదిగా నుండవలెను. ఆ రంధ్రము మిక్కిలి పెద్దదిగాను యుండగూడదు, మిక్కిలి చిన్నదిగాను యుండగూడదు. మిక్కిలి పెద్దదైనచో పాలు చాల హెచ్చుగా స్రవించును. మిక్కిలి చిన్నదిగా నున్నచో పాలుసులభముగా రావు. పాలు పోసిన వెంటనే



రబ్బరు మొనను సీసా నుండి వూడ దీసి బాగుగా రుద్ది కడుగవలెను. పిమ్మట ఒక పైంటునీటిలో ఒక అవున్సు బోరకు యాసిడువేసి ఆ నీళ్లలో ఆ మొనలనుముంచి యుంచవలెను. వట్టి మొనను శిశువు నోట పెట్టగూడదు. అటుల పెట్టినచో శిశువు చప్పరించుచుండును. అందువలన శిశువు కడుపులోనికి గాలి ప్రవేశించును. దానివలన కడుపు నొప్పి కలుగును.



People's Printing and Publishing House, Ltd., Madras.

## ఈ గ్రంథకర్తచే వ్రాయబడిన యితర గ్రంథములు.

ఆంగ్ల, ద్రవిడ, ఆంధ్ర భాషలలో ఆరోగ్యోపన్యాస గ్రంథమాల.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఇండ్లు-ఆరోగ్యము | 0 | 2 | 0 |
| 2. | డాక్టరు వచ్చులోపల యేమి చేయవలెను | 0 | 2 | 0 |
| 3. | పాఠశాలలో ఆరోగ్య శాస్త్రము (హైజీను) | 0 | 4 | 0 |
| 4. | జలము-ఆరోగ్యము | 0 | 2 | 0 |
| 5. | గాలి-ఆరోగ్యము | 0 | 2 | 0 |
| 6. | వ్యాధులు-ఆరోగ్యము | 0 | 2 | 0 |
| 7. | నిరోధింప బడదగిన వ్యాధులు | 0 | 2 | 0 |
| 8. | క్రిములను వ్యాపింపజేయు సామాన్య వ్యాధులు | 0 | 2 | 0 |
| 9. | పాలు-ఆరోగ్యము | 0 | 2 | 0 |
| 10. | బ్రాంది సారాయిని (అల్కహాలు) త్రాగుట వలన కలుగు అపాయము | 0 | 2 | 0 |
| 11. | శారీరక ఆరోగ్య శాస్త్రము | 0 | 4 | 0 |
| 12. | ఇంటిలో ఉపచర్య | 0 | 8 | 0 |
| 13. | ఆహారము-ఆరోగ్యము | 0 | 2 | 0 |
| | ప్రమాదములలో ప్రథమచికిత్స-ఆంధ్ర, ద్రవిడ, కన్నడ, మళయాళ, ఆంగ్ల భాషలలో | 0 | 12 | 0 |

శ్రీ కృష్ణా బ్రదర్సు, పోస్టు బాక్సు 166, మదరాసు.

